శ్రీహయగ్రీవాయనమః.



# ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము.

శ్రీ [illegible] ఆంధ్ర[illegible]

[illegible]

[illegible] ఇది [illegible]

శ్రీమదఖిలభూమండలమండనాయమానంబగు

చెన్నపురంబున

దొరతనమువారిచేఁగల్పితంబయిన

హిందువిద్యాసభలో

సంస్కృతభాషాపండితుండగు

పుదూరి. సీతారామశాస్త్రిచేత,

మహారాజరాజశ్రీ

మేస్తర్. కుళులో దొరగారియనుమతిని

బాలురకనుకూలముగా

నన్నయభట్టీయము మొదలగు

నాంధ్రవ్యాకరణములనుశోధించిచేయంబడినది.

౧౮౭౯వ సంవత్సరమునకు సరియైన

సిద్ధార్థినామసంవత్సరమున

పా. కుమారయ్యగారి

కళానిధియనుముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

శ్రీ

# పీఠిక.

---

ఇది-సంజ్ఞాపరిచ్ఛేదము-సంధిపరిచ్ఛేదము-శబ్దపరిచ్ఛేదము-కారకాదిపరిచ్ఛేదము-క్రియాపరిచ్ఛేదమనియైదు పరిచ్ఛేదములుగాను- అందు మొదటిపరిచ్ఛేదము భాషాప్రకరణము-వర్ణప్రకరణము-నామప్రకరణమని మూఁడు ప్రకరణములుగాను - రెండవపరిచ్ఛేదము- అచ్సంధిప్రకరణము - హల్సంధిప్రకరణము-సముదాయసంధి ప్రకరణమని మూఁడుప్రకరణములుగాను - మూఁడవపరిచ్ఛేదము - అజంతశబ్దప్రకరణము - హలంతశబ్దప్రకరణమని రెండు ప్రకరణములుగాను-నాలవపరిచ్ఛేదము విభక్తిప్రకరణము-సమాసప్రకరణము-మిశ్రప్రకరణమని మూఁడు ప్రకరణములుగాను- ఐదవపరిచ్ఛేదము క్రియాప్రకరణము-కర్తృపురుషప్రకరణము-కారయితృపురుషప్రకరణము- కర్మపురుషప్రకరణము- విశేషప్రకరణమనియైదు ప్రకరణములుగాను విభాగింపఁబడియున్నది.

---

# ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము.

౧ ప్ర - ఈ యాంధ్రవ్యాకరణమునం దెన్ని పరిచ్ఛేదంబులు.

ఉ- సంజ్ఞాపరిచ్ఛేదము-సంధిపరిచ్ఛేదము- శబ్దపరిచ్ఛేదము- కారకాదిపరిచ్ఛేదము - క్రియాపరిచ్ఛేదమని యైదుపరిచ్ఛేదంబులు.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

౧ ప్ర-సంజ్ఞాపరిచ్ఛేదమునం దెన్ని ప్రకరణంబులు.

ఉ- భాషాప్రకరణము-వర్ణప్రకరణము- నామప్రకరణమని మూఁడు ప్రకరణంబులు.

## భాషాప్రకరణము.

౧ ప్ర- ఆంధ్రభాషకు నెన్ని భేదంబులు.

ఉ- తత్సమంబు- తద్భవంబు - దేశ్యంబు- గ్రామ్యంబని నాలుగుభేదంబులు.

౨ ప్ర-తత్సమంబనఁగా నెట్టిది.

ఉ- సంస్కృతప్రాకృతశబ్దంబుల మీఁదనున్న విభక్తులను జెఱిచి తెనుఁగు విభక్తులు మొదలగువానిని గలిపి పలుకఁబడునవి తత్సమంబులు.

౩ ప్ర-అవి యెన్ని విధంబులు గలవి.

ఉ.సంస్కృతసమంబులు ప్రాకృతసమంబులని రెండువిధంబులు గలవి

౪ ప్ర-సంస్కృత సమంబు లెట్టివి- ప్రాకృతసమంబు లెట్టివి.

ఉ-దేవః-వనితా-వనం- అనుసంస్కృతశబ్దంబులకు- దేవుండు-వనిత-వనము - అనునవి సమంబులు- జడా- జమో - అను ప్రాకృతశబ్దంబులకు- జడ- జముఁడు అనునవి సమంబులు.

౫ ప్ర-తద్భవంబులనఁగా నెట్టివి.

ఉ-సంస్కృతప్రాకృతశబ్దంబులయందున్న వర్ణంబులకుఁ గొన్నియెడల వ్యత్యాసము-కొన్నియెడల లోపము-కొన్నియెడల నాధిక్యమును గలవియై పలుకఁబడునవి తద్భవంబులు.

౬ ప్ర- అవి యెన్ని విధంబులు గలవి.

ఉ- సంస్కృతభవంబులు ప్రాకృతభవంబులని రెండు విధంబులు గలవి.

౭ ప్ర- సంస్కృతభవంబు లెట్టివి- ప్రాకృతభవంబు లెట్టివి.

ఉ- సముద్రః-చంద్రః-కుడ్యం- అనుసంస్కృతశబ్దంబులకు- సంద్రము-చెందురుఁడు-గోడ- అనునవి తద్భవంబులు-కంసో-పవాళో-సరిసో అను ప్రాకృతశబ్దంబులకు- కంచు-పవడము-సరి-అనునవి తద్భవంబులు

౮ ప్ర-దేశ్యంబులనఁగా నెట్టివి.

ఉ- లోకవ్యవహారసిద్ధంబులయి శాస్త్రనిషిద్ధంబులు గానివి దేశ్యంబులు.

౯ ప్ర- దేశ్యంబు లెన్నివిధంబులుగలవి.

ఉ- త్రిలింగదేశ్యంబు లన్యదేశ్యంబులని రెండువిధంబులుగలవి.

౧౦ ప్ర- త్రిలింగదేశ్యంబు లెట్టివి వానికి నుదాహరణంబు లేవి.

ఉ- త్రిలింగదేశసిద్ధంబులగు తెనుఁగుశబ్దంబులు త్రిలింగదేశ్యంబులు-వానికి- పాలు- పెరుగు- నేయి- రోలు-రోఁకలి- ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౧౧ ప్ర- అన్యదేశ్యంబు లెట్టివి- వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ- తెనుఁగువారు అన్యదేశభాషలను దమభాషతోఁ గలిపి పలుకఁగా వాడుకపడినవి యన్యదేశ్యంబులు- వానికి- తావు- ఢాక- ఖిలీ- సేను- మోవి- కోను- - ఇవిమొదలయినవి యుదాహరణంబులు.

౧౨ ప్ర- గ్రామ్యంబులనఁగా నెట్టివి.

ఉ- లోకమునందు వాడుకగలిగి యున్ననుశాస్త్రవిరుద్ధంబులయిన వి గ్రామ్యంబులు.

౧౩ ప్ర- గ్రామ్యంబు లెన్నివిధంబులు.

ఉ- నింద్యగ్రామ్యంబుల నింద్యగ్రామ్యంబులని రెండువిధంబులు.

౧౪ ప్ర-నింద్యగ్రామ్యంబు లెట్టివి- అనింద్యగ్రామ్యంబు లెట్టివి.

ఉ- వస్తాఁడు- తెస్తాఁడు- ఇస్తాఁడు- ఇవి మొదలగు ప్రయోగారూఢంబులు గాని శబ్దంబులు నింద్యగ్రామ్యంబులు- కరకంఠుఁడు ప్రాణగోడ్డము- ఇవి మొదలగు ప్రయోగారూఢంబులగు శబ్దంబులనింద్య గ్రామ్యంబులు.

---

## వర్ణప్రకరణము.

౧ ప్ర- సంస్కృతభాష కెన్నివర్ణంబులు.

ఉ- ఏఁబదివర్ణంబులు.

౨ ప్ర- అవియేవి.

ఉ- అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ- అని యేఁబదివర్ణంబులు- ఇచటఁగొందఱు ౡ వర్ణదీర్ఘము లేదని యక్షకారముగలదని యుఁజెప్పిరి.

౩ ప్ర- ప్రాకృతభాష కెన్నివర్ణంబులు.

ఉ- సంస్కృతవర్ణంబులలో ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ః ఈ వర్ణంబులుదక్కఁదక్కిన నలువది ప్రాకృతభాషావర్ణంబులు.

౪ ప్ర- ఆంధ్రభాష కెన్ని వర్ణంబులు.

ఉ- ఏఁబదియాఱువర్ణంబులు.

౫ ప్ర- అవియేవి.

ఉ- అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ క్ష అని ౫౬.

౬ ప్ర - అవియెన్ని భేదంబులుగలవి.

ఉ- అచ్చులు-హల్లులు-ఉభయాక్షరంబులు అని మూఁడు భేదంబులు గలవి.

౭ ప్ర-వానిలో అచ్చులెన్ని-హల్లులెన్ని ఉభయాక్షరంబులెన్ని.

ఉ- అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అను ఈ ౧౬ను అచ్చులు-క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ క్ష అను నీప్పదియేడును హల్లులు అఁ అం అః అను నీ మూఁడును ఉభయాక్షరంబులు.

౮ ప్ర-అచ్చులకు హల్లులకును నామాంతరములు గలవా.

ఉ- అచ్చులు ప్రాణంబులు - హల్లులు ప్రాణులు అని చెప్పఁబడును.

౯ ప్ర- అచ్చులలో భేదంబులుగలవా.

ఉ- హ్రస్వములు దీర్ఘములు అని రెండు భేదంబులుగలవు.

౧౦ ప్ర-హ్రస్వంబులనఁగా నేవి-దీర్ఘంబులనగా నేవి.

ఉ- అ ఇ ఉ ఋ ఌ ఎ ఒ ఈ ౭ను హ్రస్వంబులు- ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ ఈ ౯యు దీర్ఘంబులు.

౧౧ ప్ర-భేదాంతరములుగలవా

ఉ-వక్రములు వక్రతమములు అని రెండు భేదంబులుగలవు.

౧౨ ప్ర-వానిలో వక్రంబులనఁగా నేవి- వక్రతమంబులనఁగా నేవి.

ఉ- ఎ ఏ ఒ ఓ లు వక్రంబులు- ఐ ఔ లు వక్రతమంబులు.

౧౩ ప్ర - హల్లులలో నేవి భేదములు.

ఉ-అయిదు వర్గంబులుగలవు.

౧౪ అవియేవి.

ఉ- క ఖ గ ఘ ఙ ఈ ౫ను కవర్గము-చ ౘ ఛ జ ౙ ఝ ఞ ఈ ౭ను చవర్గము-ట ఠ డ ఢ ణ ఈ ౫ను టవర్గము-త థ ద ధ న ఈ ౫ను తవర్గము-ప ఫ బ భ మ ఈ ౫ను పవర్గమని చెప్పంబడును.

౧౫ ప్ర-వానిలో పలభేదంబులు గలవా.

ఉ - పరుషములు-సరళములు-స్థిరములని మూఁడు భేదంబులుగలవు.

౧౬ ప్ర-పరుషములనఁగా నేవి.

ఉ-వర్గముల మొదటి వర్ణంబులు పరుషములు.

౧౭ ప్ర-సరళములనఁగా నేవి.

ఉ- వర్గముల మూఁడవ వర్ణంబులు సరళములు.

౧౮ ప్ర-స్థిరవర్ణంబులనఁగా నేవి.

ఉ-పరుష సరళములు దక్కఁదక్కి

నహల్లులుస్థిరవర్ణంబులు.

౧౯ ప్ర- మఱివిశేషసంజ్ఞులుగలవా.

ఉ-నకారంబుద్రుతమనంబడు-యరలవలుఅంతస్థములనంబడు-శషసహలు ఊష్మములనంబడు-ఈయంతస్థములును-ఊష్మములును-స్థిరములే.

౨౦ ప్ర-అంతస్థములెన్నివిధంబులుగలవి.

ఉ-లఘువులు అలఘువులని రెండువిధంబులుగలవి.

౨౧ ప్ర-లఘువులనఁగానేవి-అలఘువులనఁగానేవి.

ఉ-నాయాజ్ఞ-నాయిల్లు-అనుచోటనచ్చుకంఠెంబరంబగునచ్చునకు నాగమముగావచ్చు యశ్రుతియను పేరుగలయకారమును, కరము-కారెము-అనునిట్టిచోట్లనున్న రవర్ణమును-ఆలు-మేలు-అనునిట్టిచోట్లనున్నలవర్ణమును సిగ్గువడిరొ-దేవుఁడువలికె-అనునిట్టిచోట్లను పకారమున కాదేశంబుగవచ్చు-వకారమును లఘువులు-వాస్తవములయిన-బయలు-ఇత్యాదులయందున్నయకారంబును-ఇట్టి-మట్టి-ఇత్యాదులయందున్న అకారంబును-పెల్లు-గొల్లు-ఇత్యాదులయందున్న ళకారంబును-వాఁడు-ఇవిమొదలగుచోట్లనున్న వకారమును అలఘువులు.

౨౨ ప్ర-ఉభయాక్షరంబులకు నామంబులెవ్వి.

ఉ-అర్ధానుస్వారము-పూర్ణానుస్వారము-విసర్గము.

౨౩ ప్ర-అర్ధానుస్వారంబెయ్యది-పూర్ణానుస్వారంబెయ్యది-విసర్గమననెయ్యది.

ఉ అఁ.అనునరసున్న-యర్ధానుస్వారంబు-ఇదేఖండబిందువనియుఁ జెప్పఁబడును-అం అను నెఱసున్న పూర్ణానుస్వారంబు ఇదేపూర్ణబిందువనియుంజెప్పఁబడును-అః అను రెండుసున్నలు విసర్గమనిజెప్పఁబడును.

౨౪ ప్ర-అర్ధానుస్వారంబునకెన్నిభేదంబులు-పూర్ణానుస్వారంబునకెన్నిభేదంబులు.

ఉ-రెంటికిసిద్ధము-సాధ్యమనిరెండేసిభేదంబులు.

౨౫ ప్ర-సిద్ధంబనఁగానెయ్యది సాధ్యంబనఁగానెయ్యది.

ఉ-శబ్దముతోఁ గూడఁబుట్టినది సిద్ధంబు-శాస్త్రముచేతవచ్చునది సాధ్యంబు.

౨౬ ప్ర-సిద్ధసాధ్యఖండంబులకుదాహరణములెవ్వి.

ఉ- కలఁగి-చెలఁగి-మోలఁగి-ఇమొదలైనచోట్ల సిద్ధార్ధానుస్వారంబు-దేవుఁడు-ప్రాఁకులు-ఇవిమొదలైనచోట్ల సాధ్యార్ధానుస్వారం విసర్గమునకుభేదంబులు లేవు.

౨౭ ప్ర- సిద్ధసాధ్యపూర్ణానుస్వారంబులకుదాహరణంబులెవ్వి.

ఉ- అందము- చెందము- ఇవిమొదలైనచోట్లసిద్ధపూర్ణానుస్వారంబు- దేవుండు- కొలంకులు- ఇవిమొదలైనచోట్లసాధ్యపూర్ణానుస్వారంబు.

౨౮ ప్ర- అర్ధానుస్వారంబెక్కడెక్కడనేరీతిగానౌను,

ఉ- హ్రస్వాక్షరముమీఁద- కలంగి- చెలంగ ఇత్యాదులయందుఁబూర్ణముగానౌను- దీర్ఘాక్షరముమీఁద వాఁడు- వీఁడుఅనిఖండమేవచ్చును

౨౯ ప్ర- అకారాదివర్ణములకుత్పత్తిస్థానంబులేవి.

ఉ- అ ఆ క ఖ గ ఘ ఙ హ అః ఈ౯టికిని స్థానంబుకంఠము- కావుననివి కంఠ్యంబులు- ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ ఈ౯టికినితాలువులు స్థానంబులు - కావుననివితాలవ్యంబులు- ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష ఈ౧౦టికిని మూర్ధముస్థానంబు- కావుననివిమూర్ధన్యంబులు- ఌ ౡ త థ ద ధ న ల శ స చ జ ఈ౧౨కినిదంతంబులుస్థానంబులు కావుననివిదంత్యంబులు- ఉ ఊ ప ఫ బ భ మ ఈ౭టికినిఓష్ఠంబులుస్థానంబులుకావుననివిఓష్ఠ్యంబులు- ఎ ఏ ఐ ఈ౩కిని కంఠతాలువు స్థానంబులు- కావుననివికంఠతాలవ్యంబులు- ఒ ఓ ఔ ఈ ౩టికిని కంఠోష్ఠంబు స్థానంబు- కావుననివికంఠోష్ఠ్యంబులు- వకారమునకు- దంతోష్ఠంబులు స్థానంబులు- కావుననిదిదంత్యోష్ఠ్యంబు- ఙ ఞ ణ న మ ఈ ౫కిని నాసిక యను స్థానంబుకావున నివియను నాసికంబులు.

౩౦ ప్ర- అచ్చులకుహల్లులతోఁ జేరునపుడుసంకేతంబు లెవ్వియేని గలవా.

ఉ- కలవు- అకారమునకుఁదలకట్టు ఆకారమునకు- దీర్ఘము ఇకారమునకు గుడి ఈకారమునకుగుడిదీర్ఘము- ఉకారమునకుఁగొమ్ము- ఊకారమునకుఁగొమ్ముదీర్ఘము- ఋకారమునకు వట్రువసుడి - ౠకారమునకు వట్రువసుడిదీర్ఘము- ఎకారమునకుఎత్వము- ఏకారమునకుఏత్వము- ఐకారమునకుఐత్వము ఒకారమునకుఒత్వము- ఓకారమునకు ఓత్వము- ఔకారమునకు ఔత్వము అని సంకేతంబులు.

౩౧ ప్ర- హల్లులకు హల్లులతోఁ జేరునపుడు సంకేతంబులేలాగు.

ఉ- తకారమునకు తాముడి- నకారమునకు నాముడి- మకారమునకు మాముడి - యకారమునకు కొయ్యావడి- రేఫమునకుఁ గ్రావలపలగిలక యను సంకేతంబులున్నవి- కావున నా సంకేతంబులే హల్లుల క్రింద వ్రాయఁబడుచున్నవి.

౩౨ ప్ర- సంకేతంబులేనిహల్లులేవి.

ఉ- పైనుదహరింపఁబడిన హల్లులు దక్కఁ దక్కిన హల్లులకు సంకేతంబు లేదు- కావున నవే హల్లుల క్రింద వ్రాయఁబడుచున్నవి.

౩౩ ప్ర-తలకట్టు లేక యకారముతోఁ గూడినట్టు బలుకబడునవి యేవి.

ఉ- ఖ ఛ జ ఝ ట ణ బ ఱ ల ఇవి.

౩౪ ప్ర - వర్ణోచ్చారణక్రమఁ బెట్టిది.

ఉ- అకారము-ఇకారము-ఉకారము-కకారము- ఖకారము-గకారము-అని ర ఱ లు దక్కఁ దక్కిన వర్ణములనన్నిటిని కారశబ్దముతోఁ జేర్చి పలుకవలయు- ర ఱ లను- రేఫము శకటరేఫము అని- ఇఫ శబ్దముతోఁ జేర్చి పలుకవలయు - ఇది వర్ణోచ్చారణక్రమంబు.

౩౫ ప్ర - పదాదియందు లేని వర్ణంబు లెవ్వి.

ఉ- తత్సమేతరములయందు యకారమును-ఋ-ౠ-ఌ-ౡ- ణ ళ లును పదాదిని లేవు.

౩౬ ప్ర-ఉదాహరణము లెవ్వి.

ఉ- ఎవఁడు-ఏమి-ఉంగరము-ఊరు-ఇత్యాదులు-ఇచ్చోట్ల యకారాదులంజేర్చి వ్రాయఁగూడదు.

౩౭ ప్ర-చ జ లకు దంత్యతాలవ్య భేదంబు లెట్టివి.

ఉ- ఇ ఈ ఎ ఏ లం గూడినవి తాలవ్యంబులు-అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ వీనితోఁ గూడినవి దంత్యంబులు.

౩౮ ప్ర - వీనికుదాహరణంబు లెవ్వి.

ఉ-చిగురు-చీర-చెట్టు-చేవ-జిగి జీడి-జెముడు-జేజే- ఇవి తాలవ్యంబులు-చక్కెర-చాప-చుట్టు-చూపు-చొక్కము- చేటు-చౌకము-జతనము-జాతర-జున్ను- జూదము-జొబ్బిలు-జోలి-జౌకు- ఇవి దంత్యములకుదాహరణములు.

---

## నామ ప్రకరణము.

౧ ప్ర-నామంబనఁగా నేది.

ఉ-వర్ణకంబులకు యోగ్యంబులైన దేవయనునది మొదలుగాఁగల సంస్కృత శబ్దములును-వానితో సమంబులగు గోడ-మేడ మొదలగు తెనుఁగు శబ్దంబులును నామంబులు.

౨ ప్ర -వర్ణకంబులనఁగా నేవి.

ఉ- నామంబులకును, క్రియలకును పరంబుగావచ్చు- డుముపులు నురుము మొదలైన వివర్ణకంబులు.

౩ ప్ర-క్రియలనఁగా నేవి.

ఉ-పోషించు- వ్రాయు- మొదలైనవి క్రియలు.

౪ ప్ర-కాలంబనఁగా నేవి-అవి యేలాగున నుండును.

ఉ-ఉత్తమపురుష క్రియలును భూతతద్ధర్మార్థకముల ప్రథమపురుషైకవచనంబులును దప్పఁ దక్కిన క్రియాపదంబులను నొక్కొ షష్ఠియు- తానేనులు తప్పఁ ప్రథమాంత పదం

లనుగూర్చి ద్వితీయయు - ఇంచుక - మొదలయిన కించిదర్థక శబ్దంబులును భళీ మొదలయిన ప్రశంసార్థకశబ్దంబులును - ఓహో మొదలయినయాశ్చర్యార్థకశబ్దంబులును - అకటా మొదలగు సంతాపార్థకశబ్దంబులును - ఎపుడు - అపుడు - ఏమి - అను శబ్దంబులును - నిన్నె - నన్నె - వానిన - అను నేవార్థకశబ్దంబులును - వచ్చి - పోయి - రాక - పోక - మొదలగు క్త్వార్థకశబ్దంబులును - కదా అను కిలార్థకశబ్దంబును - ఊరక మిన్నక మొదలగు తూష్ణీమర్థకశబ్దంబులును మొదలగు నవికళలు - ఈశబ్దంబులకు నకారంబుతుదనుండదు.

౫ ప్ర - ద్రుతప్రకృతికంబులనఁగా నెవి వానికినుదాహరణంబులేలాటివి

ఉ - కళా శబ్దంబులుదక్కఁ దక్కిన శబ్దంబులు ద్రుతప్రకృతికంబులు - వానికి నకారముతుదనుండును - వానికి - శత్రులను గెలిచెను - మిత్రులను మనిచెను - ఇత్యాదులుదాహరణంబులు - ఇదిసంజ్ఞాపరిచ్ఛేదము.

---

## సంధిపరిచ్ఛేదము.

౧ ప్ర - సంధిపరిచ్ఛేదమునందు నెన్ని ప్రకరణంబులు,

ఉ - అచ్సంధి ప్రకరణంబు హల్సంధి ప్రకరణంబు - సముదాయసంధి ప్రకరణంబని మూఁడు ప్రకరణంబులు.

## అచ్సంధి ప్రకరణము.

౧ ప్ర - అచ్సంధి యనఁగా నేలాటిది.

ఉ - అచ్చులనచ్చులతోను హల్లులతోను గలిపి పలుకునపుడు - అచ్చునకు వచ్చునట్టి యాగమలోపాదేశరూపంబులగు కార్యంబులు అచ్సంధి.

౨ ప్ర - ఆగమసంధి యనఁగా నెట్టిది.

ఉ - మునుపటియచ్చుప్రక్కఁ జేరుమఱియొకవర్ణంబాగమసంధి.

౩ ప్ర - అదియెన్ని విధంబులుగలది

ఉ - యకారాగమసంధి - రేఫాగమసంధి - నకారాగమసంధి - టకారాగమసంధి యని నాల్గువిధంబులుగలది.

౪ ప్ర - యకారాగమ మెక్కడవచ్చును.

ఉ - ద్రుతంబులేని శబ్దంబులతుదనున్న అ ఆ ఇ ఈ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఈపదియచ్చులకుం బైఁ బరంబగు నచ్చునకు ముందు వచ్చును - ఇదే యత్వసంధియని చెప్పఁబడుచున్నది.

౫ ప్ర - దీనికినుదాహరణంబులేవి.

ఉ - నేనయత్త - నవలాయది - మాటయతడు - శ్రీయిచ్చెన్ - పన్నెగొల్లె - జేజేయిచ్చె - హైయొప్పు - ఇతండే యెటయీశ్వరుఁడు - ఓహోయిది - గ్లౌయుదయించెన్ - ఇవి మొదలైనవి యుదాహరణంబులు.

౬ ప్ర - రేఫాగమ మెక్కడవచ్చును.

ఉ - కర్మధారయ సమాసంబులయందు - అకారాంతోకారాంతపదములకు ఆలుశబ్దము పరంబగునపుడు - రేఫాగమము వచ్చును - తత్సమంబులయయ్యాకారంబునకు ఉకారంబును వచ్చును.

౭ ప్ర.-దీనికి ఉదాహరణంబులేవి.

ఉ.- ధీరురాలు - శూరురాలు - గుణవంతురాలు - భక్తురాలు - పేదరాలు - గొడ్డురాలు ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౮ ప్ర.- నకారాగమమెక్కడ వచ్చును.

ఉ.-షష్ఠీతత్పురుష సమాసంబుల యందచ్చుపరంబగునపుడును కర్మధారయసమాసంబులయందుఁ బరుషసరళములు పరంబులగునపుడును - మూర్చి - వట్టి - అందు - తన - ఈ వర్ణకంబులు పరంబులగునపుడును నామాంతము నందున్న యుకారమునకు నకారాగమము వచ్చును.

౯ ప్ర.-ఇందుకు నుదాహరణంబులేవి.

ఉ.-రాజునెదుట - పామునెమ్ములు మోమునందము - ఇవి షష్ఠీతత్పురుష సమాసంబులయందుదాహరణములు - గండుం గోయిల - మనుపుం జెక్కులు - మురువుఁ జెక్కులు - సొగసుం దలిరులు - కులుకుఁ బలుకులు - తళుకుఁ గెజ్జెలు - అలరుఁ [illegible]ంపము - పొలుపుఁ దాలు - వలపుం దిన్నెలు - కటుకుఁ బల్లెము ఇవి కర్మధారయసమాసంబులయందు నుదాహరణంబులు - దేవుఁ గూర్చి - జ్ఞానముం బట్టి - దేవునందు - సొగసుం దనము - ఇవి మూర్చి మొదలగు వర్ణకంబులు పరంబులగునపుడుదాహరణంబులు.

౧౦ ప్ర.- టకారాగమమెచ్చోట వచ్చును.

ఉ.-కర్మధారయసమాసంబులయందుఁ బదాంతమునందున్న యుకారమునకు నచ్చుపరంబగునపుడు టకారాగమము వచ్చును.

౧౧ ప్ర.- ఇందుకు నుదాహరణంబులెయ్యవి.

ఉ.-చిగురుటాకులు - కటుకుటమ్ములు - నిగ్గుటద్దము. ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౧౨ ప్ర.- లోపసంధియనఁగా నెట్టిది.

ఉ.-రెండచ్చులను జేర్చి పలుకునపుడొక యచ్చు అదృశ్యమగుట లోపసంధి.

౧౩ ప్ర.-ఈసంధి యేయచ్చులకు వచ్చును.

ఉ.- అ ఇ ఉ ఓ ఈ నాలుగచ్చులకును వచ్చును.

౧౪ ప్ర.- అకారమునకు లోపసంధి యెక్కడెక్కడ నేలాగునవచ్చును.

ఉ.- కొన్నిచోట్లఁ బదాంతము

వందును - కొన్నిచోట్లంబదాదియందును - కొన్నిచోట్లఁబదమధ్యమునందును వికల్పముగవచ్చును.

౧౫ ప్ర- పదాంతమునందు నీసంధికినుదాహరణంబులేవి.

ఉ- మేనత్త - లెస్సగు - ఎల్లపుడు - ఊరకుండె - ఇవిమొదలయినవి యుదాహరణంబులు - ఇచటసంధిలేనపుడు - మేనయత్త - లెస్సయగు - ఎల్లయపుడు - ఊరకయుండెఅని యశ్రుతివచ్చును.

౧౬ ప్ర- పదాదియందు నీసంధికి నుదాహరణంబులేవి.

ఉ- కాఁపుది - బాఁపనది - అట్టిది ఇవి మొదలయినవి యుదాహరణంబులు ఈసంధిలేనపుడు - కాఁపది - బాఁపనయది - అట్టియది అని మొదటియుదాహరణమునందు ఉకారలోపమును దక్కినయుదాహరణంబుల యందు యశ్రుతియును వచ్చును.

౧౭ ప్ర- పదమధ్యమునందు నీసంధికినుదాహరణంబులెవ్వి.

ఉ- ఉంగరము - ఉంగ్రము ఇవి మొదలయినవియుదాహరణంబులు.

౧౮ ప్ర- ఇకారమునకులోపసంధియెక్కడెక్కడవచ్చును.

ఉ- పదాంతమునందును బదమధ్యమునందును వచ్చును.

౧౯ ప్ర- పదాంతంబున నదేలాగునవచ్చును.

ఉ- కొన్నియెడల నిత్యముగాను - కొన్నియెడల వికల్పముగానువచ్చును.

౨౦ ప్ర- ఏచోట నిత్యము.

ఉ- మధ్యమపురుషక్రియలయందు నిత్యముగవచ్చును.

౨౧ ప్ర- దీనికి నుదాహరణంబులేవి.

ఉ- కంటివంబను - పోషించితిరన్యల - ఇవి మొదలయిననియుదాహరణంబులు.

౨౨ ప్ర- ఏచోట్ల వికల్పముగవచ్చును.

ఉ- ప్రథమోత్తమపురుషక్రియలయందును - ఏనిశబ్దంబునందును - ఏమ్యాదులయందును వికల్పము వచ్చును.

౨౩ ప్ర- వానికి నుదాహరణంబులేవి.

ఉ- వచ్చిరార్యులు - వచ్చిరియార్యులు - ఇవి మొదలైనవి ప్రథమపురుషంబులకును - కొలిచితిమార్యుల - కొలిచితిమియార్యుల - ఇవి మొదలైనవి యుత్తమపురుషక్రియలయందు నుదాహరణంబులు - అయ్యనేనమ్మనేనింగొలిచెద - అయ్యనేనినమ్మనేని ఇదియేనిశబ్దంబునందు నుదాహరణంబు - ఏమయ్యా - ఏమియయ్యా - అదేమి - అదియేమి - ఇదేమి - ఇదియేమి ఇవి మొదలైనవి ఏమ్యాదులయందు నుదాహరణంబులు - ఇచటలోపంబులేనపుడు యశ్రుతి.

౨౪ ప్ర- పదమధ్యంబునందు నెచ్చోట్లనేలాగున వచ్చును.

ఉ- పదమధ్యంబులయందు నలడలమీఁదనున్న యికారమునకు వికల్పముగ వచ్చును.

౨౫ ప్ర- దీనికి నుదాహరణంబులేవి.

ఉ- ఉనికి-ఉన్కి-మునికి-మున్కి-బుడిపి-బుడ్పి- ఇవి మొదలైనవి యుదాహరణంబులు.

౨౬ ప్ర- ఉకారమునకు లోపం బెచ్చోట్ల వచ్చును.

ఉ- పదాంతంబునందును-పదమధ్యంబునందును వచ్చును.

౨౭ ప్ర- పదాంతములయందే లాగున వచ్చును.

ఉ - నిత్యముగాను-వికల్పముగాను వచ్చును.

౨౮ ప్ర-పదాంతము నందు నెచ్చోట్ల నిత్యముగ వచ్చును.

ఉ-ఇంపగు-సొంపగు-దేవుఁడతఁడు-గురు దేవులాచార్యులు ఇవి మొదలైన ప్రథమావిభక్తి సంబంధియగు నుకారమునకు నిత్యముగ వచ్చును.

౨౯ ప్ర-పదాంతము నందు నెచ్చోట్ల వికల్పముగ వచ్చును.

ఉ-ద్వితీయాదివిభక్తులయందును వర్తమానార్థక చువర్ణకమునందును వికల్పముగ వచ్చును.

౩౦ ప్ర- వానికి నుదాహరణంబులేవి.

ఉ. మమ్మేలు-మమ్మునేలు-నీకొఱకిచ్చెద- నీకొఱకునిచ్చెద- నీకారోగ్యము-నీకునారోగ్యము-కీర్తియందనురక్తి కీర్తియందునురక్తి- ఇవి ద్వితీయావిభక్తులయందునుదాహరణంబులు-నగుచిట్లనియె- నగుచునిట్లనియె-అనుచుండెను-అనుచునుండెను ఇవి వర్తమానార్థక చువర్ణకంబునకుదాహరణంబులు.

౩౧ ప్ర-సమాసంబునందు ఉకారమునకు లోపం బెచ్చోట నేలాగున వచ్చును.

ఉ - సమాసంబునందు-పూర్వపదాంతమునందున్న రువర్ణోకారంబునకు లోపము వికల్పముగ వచ్చును.

౩౨ ప్ర- దీనికి నుదాహరణంబులేవి.

ఉ- కారుపోతు-కార్పోతు-గోరుపులి-గోర్పులి-ఇవి మొదలైనవి.

౩౩ ప్ర- పదమధ్యమునందు కారమునకు లోపం బెచ్చోట నేలాగు వచ్చును.

ఉ- పదమధ్యమునందున్న నలడాది సంబంధియగు నుకారంబునకు నుతదాద్యర్థకములయందున్న పువర్ణోకారమునకును లోపంబు వికల్పంబుగ వచ్చును.

౩౪ ప్ర- వీనికి నుదాహరణంబులేవి.

ఉ-పునుక-పున్క-చిలుక-చిల్క-కదుపు-కద్పు-చేరుచు-చేర్చు అవు

డు-అప్డు-ఇపుడు-ఇప్డు-ఎపుడు-ఎప్డు-కపురము-కప్రము-ఇవి మొదలైన వియుదాహరణంబులు.

౩౫ ప్ర-పదమధ్యమందున్న నువర్ణమున కెద్దియేని కార్యము గలదా.

ఉ- కలదు.

౩౬ ప్ర-అది యెద్ది.

ఉ- వర్తమానార్థక చువర్ణకంబు పరంబగునపుడు - నువర్ణము నకారమునకు లోపంబును- నకారమునకు పూర్ణబిందువును వికల్పముగా వచ్చును.

౩౭ ప్ర- దీనికి నుదాహరణంబులేవి.

ఉ-అనుచు-అన్చు-అంచు-వినుచు విన్చు-వించు-కనుచు-కన్చు- కంచు-ఇవి మొదలయినవి-చనునకు రాదు.

౩౮ ప్ర-అ ఇ ఉ ఎ ఈనాలుగింటికిని లోపంజేశబ్దంబులు పరంబులగునపుడు వచ్చును.

ఉ- పరిమాణార్థకశబ్దంబులును-ఆకుశబ్దమును- అంబాద్యర్థకశబ్దంబులును పరంబులగునపుడు-అ ఇ ఉ ఈ మూఁటికిని- ఎఁడు పరంబగునపుడు ఎకారమునకు సహితము నిత్యముగ వచ్చును.

౩౯ ప్ర- వీనికి నుదాహరణంబులేవి.

ఉ- పడెఁడు-తూమెఁడు-పోకంత-ఆవంత-కాసంత-ఇంతేసి-పదేసి నూటేసి-మ్రాకెత్తు-కానెత్తు-దుడ్డెత్తు ఇవి పరిమాణార్థకశబ్దంబులు పరంబులగునపుడుదాహరణంబులు-పొగాకు-మామిడాకు-చింతాకు-ఇవి ఆకుశబ్దంబు పరంబగునపు డుదాహరణంబులు-పాపమ్మ-బుచ్చమ్మ-సోమక్క-పోలక్క-దేవయ్య-దేవన్న-దేవప్ప ఇవి అంబాద్యర్థకంబులు పరంబులగునపుడుదాహరణంబులు-గిన్నెఁడు-దొన్నెఁడు-ఇవి హ్రస్వైకారంబునకు ఎఁడు పరంబగునపు డుదాహరణంబులు.

౪౦ ప్ర- ద్విరుక్తశబ్దంబులయందు నేలాగు లోపసంధి వచ్చును.

ఉ-వానియందు మొదటిశబ్దముతుదనున్న అ ఇ ఓ ఈ మూఁటికిని అచ్చు పరంబగునపుడు లోపము వచ్చును.

౪౧ ప్ర - వీనికి నుదాహరణంబులేవి.

ఉ - అన్నన్న- ఏమేమి-ఓహోహో-ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౪౨ ప్ర - ఆదేశసంధి యనఁగా నెట్టిది.

ఉ- ఒకవర్ణమును బోఁగొట్టి మఱియొకవర్ణంబు వచ్చుట.

౪౩ ప్ర - ఇది యేయచ్చులకు వచ్చును.

ఉ-అ-ఉ- ఈ రెంటికిని వచ్చును.

౪౪ ప్ర-అకారంబున కాదేశం

జెచటవచ్చును.

ఉ- అలుక్సమాసంబునందు విభక్త్యంతాకారమునకు ఇకారాదేశము వచ్చును.

౧౫ ప్ర-దీనికినుదాహరణంబులేవి.

ఉ-నీచేతిపోరు-నాతోటిచెలిమి-నావలని నేరమి-ఇవియుదాహరణంబులు.

౧౬ ప్ర-ఉకారంబునకు ఆదేశసంధియెచ్చటవచ్చును.

ఉ-అలుక్సమాసంబునందు అందు ఇందు విభక్తులయందున్న యుకారమునకు అలియను నాదేశంబువచ్చును- నాయందలికరుణ- నీయందలిభక్తి ఇందలివారు- ఇవిమొదలయినవియుదాహరణంబులు.

---

## హల్సంధిప్రకరణము.

౧ హల్సంధియనఁగా నెట్టిది.

ఉ-హల్లులను గలిపిపలుకునపుడు హల్లునకువచ్చునాదేశంబుహల్సంధి

౨ ప్ర - ద్రుతంబునకుఏమికార్యంబులువచ్చును-వానికినుదాహరణంబులేలాగు.

ఉ- ద్రుతంబునకు సరళస్థిరంబులుపరంబులగునపుడు-లోపసంశ్లేషపూర్ణబిందువులువికల్పముగావచ్చును-తాను నేనులకుసంశ్లేషమురాదు దానికికొలుతునుగదాధరు-కొలుతుఁ గదాధరు-కొలుతుంగదాధరు-కొలుతునుగదాధరు- ఇవిసరళవర్ణంబు పరంబగునపుడుదాహరణంబులు- పలుకుదుసత్యము - పలుకుదుఁ సత్యము-పలుకుదునుసత్యము - ఇవిస్థిరవర్ణంబుపరంబగునపు డుదాహరణంబులు- ఇచటబిందువురాదు-తావినియె-తానువినియె-నేనువింటిని- నేనువింటిని-ఇవితాను నేనులకుదాహరణములు.

౩ ప్ర- ద్రుతంబునకుపరుషములు పరంబులగునపుడు ఏకార్యంబులువచ్చును-దీనికినుదాహరణంబులేలాగు.

ఉ-దానికి- పరుషములుపరంబులగునపుడు-పరుషములకు సరళాదేశము నిత్యముగనగును- అవిపరంబగునపుడుబిందువును సంశ్లేషమును వికల్పముగావచ్చును - దానికిదేవుంగొలిచెద- దేవుఁగొలిచెద- దేవుఁ గొలిచెదఅనియుదాహరణంబులు.

౪ ప్ర-పరుషములకుసరళములువచ్చుటకునుదాహరణంబులేలాగు.

ఉ- దేవునింగొలిచెద-మిగులంజక్కనివాఁడు-వచ్చెండక్కరి- దేవుందలఁతు-ననుం బ్రోవుము-ఇవిమొదలయినవిక్రమముగా నుదాహరణంబులు.

౫ ప్ర- పరుషములకుమఱియెక్కడపయాదేశంబులువచ్చును.

ఉ-ప్రథమావిభక్తులకంటెఁబ్రథమాసమాసంబులకంటెఁబరంబులగు ప

రుషములకు గసడదవలు వచ్చును.

౬ ప్ర-వీనికి నుదాహరణంబు లేవి.

ఉ-సిరిగలవాఁడు- దానము సేసెను-వరుఁడు డెక్కులాఁడు-తనయిల్లు దాపురతంపర-నిజము పలుకును- ఇవి ప్రథమావిభక్తికి నుదాహరణంబులు-చేయుచున్నాడు గదా-వచ్చిరి గదా-[illegible] గదా. అపుడు గనియె-ఇపుడు [illegible] ఎపుడు దావచ్చె ఇవి ప్రథమా [illegible] లకు నుదాహరణంబులు.

౭ ప్ర-[illegible] సడదవలు మఱియు నెక్కడ [illegible]

ఉ-ద్వంద్వసమాసంబునందు నుత్తరపదాదిస్థంబున్న పరుషములకును వచ్చును.

౮ ప్ర-వీనికి నుదాహరణంబు లేవి.

ఉ-కూడుగోకలు-కాలుసేతులు-టక్కుటెక్కులు- తల్లిదండ్రులు ఊరువల్లెలు-ఇవి మొదలయినవి.

౯ ప్ర-పరుషములకు గసడదవ లెచ్చట రావు.

ఉ-తెనుఁగుశబ్దములకంటెఁ బరంబులగు తత్సమశబ్దంబులయొక్క పరుషములకు రావు.

౧౦ ప్ర-వీనికి నుదాహరణంబు లేవి.

ఉ- దొరకరుణించె- సిరిచంచలము-అదిటెంకము-ఇదితోయము-అతఁడు పరమదయాళువు - ఇవి మొదలయినవి.

## సముదాయసంధిప్రకరణము.

౧ ప్ర- సముదాయసంధియనఁగా నేది.

ఉ. అచ్చుతోఁ గూడిన హల్లునకు హల్లు పరంబగునపుడు వచ్చు లోపముగాని యాదేశముగాని సముదాయసంధి యనఁబడును.

౨ ప్ర-అది యెచ్చోట నేది వచ్చును

ఉ - మువర్ణకంబునకు పద్యాదులు పరంబగునపుడు లోపము నుబిందువును వికల్పముగ వచ్చును.

౩ ప్ర-దీనికి నుదాహరణంబు లేవి.

ఉ-భయపడి-భయంపడి- భయముపడి-పదపడి-పదంపడి-పదముపడి సూత్రపట్టినట్టు- సూత్రంపట్టినట్టు- సూత్రముపట్టినట్టు- సంతోషపాటు సంతోషంపాటు- సంతోషముపాటు-ఇవి మొదలయినవి.

౪ ప్ర-మఱియు దానికి నెక్కడ నేది వచ్చును.

ఉ-కర్మధారయ సమాసమునందు మువర్ణకమునకు, పు -ంపు-అను నాదేశములు నిత్యముగ వచ్చును.

౫ ప్ర-వీనికి నుదాహరణంబు లేవి.

ఉ. సరసపుమాట-సరసంపుమాట- కనకపుబొమ్మ-కనకంపుబొమ్మ.

౬ ప్ర-మఱియెచ్చోట సముదాయసంధి గలుగు.

ఉ - సమాసంబునం ద్విత్వయుక్తంబులగు- న్న - ల్ల- అనువానియొక్క మొదటి నవర లక్షరంబులకు

వికల్పంబుగలోపంబువచ్చును-వీనికి కన్నుదోయి-కనుదోయి-కల్లుకుండ కలుకుండ- ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౭ ప్ర- మఱియు నెచ్చోటనను దాయసంధికలుగును.

ఉ- విభక్తిపరంబగునపుడును- సమాసంబునందును- నామంబులతుద నున్న- రు-ఱు-ల్లు- మొదలగువానికి టింట్యాగములువచ్చును.

౮ ప్ర-రుల్వాదులనఁగానేవి.

ఉ-రు-ఱు-ల్లు-డు-లి-యి-ఱ్ఱు-న్ను-ము-ఇవి మొదలయినవి.

౯ ప్ర-టింట్యాదులనఁగానేవి.

ఉ.టి-ంటి-తి-ఇ--ప- ఇవి మొదలయినవి.

౧౦ ప్ర.వీనికినుదాహరణంబులేవి

ఉ - నీరు-నీటికి-నీటివఱద-ఏఱు-ఏటికి - ఏటికాలువ- విల్లు- వింటికి- వింటినారి- కూడు- కూటికి- కూటికుండ- అంబలి-అంబటికి-అంబటినీళ్లు-నేయి-నేతికి నేతిముంత-రాయి-రాతికి-రాతిబావి-గోఱ్ఱు గోటికి- గోటిపట్టెలు-కన్ను కంటికి-కంటితుడ-మేను-మేనికి-మేనియందము, ఇవి మొదలయినవి- పవర్గకము- కొన్నియెడల బిందుపూర్వకముగా వచ్చును-పాము-బాఁపతేఁడు- ఇనుము- ఇనుపకోల- ఇది విభక్తిపరంబగునపుడురాదు.

---

## శబ్దపరిచ్ఛేదము.

౧ ప్ర-శబ్దపరిచ్ఛేదమునందెన్ని ప్రకరణంబులు.

ఉ- అజంతశబ్దప్రకరణంబు-హలంతశబ్దప్రకరణంబని రెండు ప్రకరణంబులు.

---

### అజంతప్రకరణము.

౧ ప్ర- అజంతశబ్దంబులెన్ని విధంబులుగలవి.

ఉ- అవ్యయంబులు-నామంబులని రెండువిధంబులుగలవి.

౨ ప్ర- అవ్యయంబులనఁగా నెట్టివి.

ఉ-ఓహో-ఔర-మఱి-కదా-అకటా-అయ్యో-కటకట- మఝ్ఝూ-భళి-అనియీలాగున- విభక్తులును-లింగంబులును- వచనంబులును లేక పలుకఁబడునవియవ్యయంబులు.

౩ ప్ర నామంబులనఁగా నెట్టివి.

ఉ-దేవుఁడు-దేవుని౯- దేవుని చేత౯-దేవునికొఱకు౯.అనియీలాగున లింగవిభక్తివచనములతోఁగూడిపలుకఁబడునవి నామంబులు.

౪ ప్ర-నామంబులెన్నివిధంబులుగలవి.

ఉ-మహదర్థకములు అమహదర్థకములని- రెండువిధంబులుగలవి.

౫ ప్ర-మహదర్థకములనఁగానేవి.

ఉ- స్త్రీ పశు జడవాచకంబుల కంటెనన్యంబులైనవియు-వానివిశేష

జపదంబులును-మహదర్థకములు.

౬ ప్ర-అమహదర్థకము లనఁగా నేవి.

ఉ- స్త్రీవాచకంబులును బశువాచకంబులును - జడవాచకంబులును- వాని విశేషణంబులును-అమహదర్థకములు.

౭ ప్ర-మహత్తులమీఁదను అమహత్తులమీఁదనువచ్చు విభక్తులెన్నివిధంబులుగలవి.

ఉ- ప్రథమ-ద్వితీయ-తృతీయ-చతుర్థి-పంచమి-షష్ఠి-సప్తమి-అని యేడువిధంబులుగలవి.

౮ ప్ర-ప్రథమా విభక్తియెన్నివిధంబులుగలవి.

ఉ-కేవలప్రథమ- సంబోధనప్రథమ-అని రెండువిధంబులు గలవి.

౯ ప్ర-ప్రథమా విభక్తివర్ణకంబులెన్ని-

ఉ-డు-ము-వు-లు-అని నాల్గువర్ణకంబులు.

౧౦ ప్ర-వానిలో నేకవచనంబునందువచ్చునవియేవి- బహువచనంబునందువచ్చునవియేవి.

ఉ-డు-వు-ము-ఈమూఁడును-ఏకవచనంబునందు వచ్చును-లు- బహువచనంబునందేవచ్చును.

౧౧ ప్ర-ఆయేకవచనంబులలో మహత్తులమీఁదవచ్చునదియేది-అమహత్తుల మీఁదవచ్చునదియేది-రెంటిమీఁదనువచ్చునదియేది.

ఉ-డు అనునది మహత్తులమీఁదను- ము అనునదియమహత్తులమీఁదను-వు- అనునది రెంటిమీఁదనువచ్చును.

౧౨ ప్ర-డువర్ణకము-ఏచోటనిత్యము-ఏచోటవైకల్పికము.

ఉ- కేవలప్రథమార్థమునందు నిత్యము సంబోధనమునందు వైకల్పికము.

౧౩ ప్ర- డువర్ణకము ఎట్లువచ్చును.

ఉ-ముందుగా అర్ధానుస్వార-పూర్ణానుస్వారంబులతో గూడివచ్చును.

౧౪ ప్ర-సంబోధనము నందు శబ్దంబులయొక్క తుదను- ఏకవచనబహువచనంబులకు నేమియాగమంబులువచ్చును.

ఉ- ఏకవచనంబునకు అదాగమమును - బహువచనంబునకుఆరాగమమును వీనికి వికల్పముగాదీర్ఘమునువచ్చును.

౧౫ ప్ర-మువర్ణకంబునకుఁ బరముగా నేమివచ్చును.

ఉ-ము- బు- అను రెండును- హ్రస్వంబుకంటెఁబరముగానున్న మువర్ణకమునకు వికల్పముగావచ్చును.

౧౬ ప్ర- ఆ ము బు లు-రెండునువచ్చునపుడు. పూర్వమువర్ణకంబునకేమివచ్చును.

ఉ-ము-అనునది పరంబగునపుడు సంశ్లేషమును - బు-అనునదిపరంబ

గునపుడు పూర్ణబిందువును వచ్చును.

౧౭ ప్ర-ద్వితీయావిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ-ని- ను-ల- కూర్చి-కుఱించి-అనైదువర్ణకంబులు.

౧౮ ప్ర-వానిలో నేకవచనంబునందువచ్చునవియేవి-బహువచనంబునందువచ్చునవియేవి- రెంటనువచ్చునవియేవి.

ఉ-ని-ను-అనునవిరెండునునేకవచనంబునందువచ్చును-ల-అనునదిబహువచనంబునందువచ్చును-కూర్చి-కుఱించి- అనునవిరెంటనువచ్చును.

౧౯ ప్ర-ని- ను- అనునవియేలాగునవచ్చును.

ఉ-వికల్పముగవచ్చును.

౨౦ ప్ర- ఆయేకవచనంబులలో నివర్ణకంబెచటవచ్చును- నువర్ణకంబెచటవచ్చును.

ఉ - నామాంతమునందున్న యికార ఈకార ఐకారములమీఁద నివర్ణకమునుదక్కినచోట్లనువర్ణకమునువచ్చును- మహత్తులమీఁదసర్వత్ర నివర్ణకమువచ్చును.

౨౧ ప్ర-తృతీయావిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ-చే- చేత- తో- తోడ-అనినాలుగువర్ణకంబులు.

౨౨ ప్ర-వానిలో నేది యేవచనంబునందువచ్చును.

ఉ-అన్నియును రెండువచనంబులయందు వచ్చును.

౨౩ ప్ర-చతుర్థీవిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ- కయి-కొఱకు-అని రెండువర్ణంబులు.

౨౪ ప్ర-వానిలో నేవచనంబునందేదివచ్చును.

ఉ-రెండును-రెంటను-వచ్చును.

౨౫ ప్ర-పంచమీవిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ-పట్టి- వలన-కంటె-అనిమూఁడువర్ణకంబులు.

౨౬ ప్ర-వానిలో నే వచనంబునందేదివచ్చును.

ఉ-అన్నియు రెండు వచనంబులయందువచ్చును.

౨౭ ప్ర-షష్ఠీవిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ-కి-కు-లో-లోపల- యొక్క-అనినైదువర్ణకంబులు.

౨౮ ప్ర-వానిలో నేవచనంబునందేదివచ్చును.

ఉ-లో- లోపల ఈ రెండు బహువచనమునందువచ్చును-తక్కినవిరెండువచనంబులయందునువచ్చును.

౨౯ ప్ర-కివర్ణకంబెక్కడ వచ్చును-కువర్ణకంబెక్కడవచ్చును.

ఉ-ఇకారాంత ఈకారాంత ఐకారాంతములమీఁద కివర్ణకమును తక్కినవానిమీఁద కువర్ణకమును వచ్చును.

౩౦ ప్ర- సప్తమీవిభక్తికెన్నివర్ణకంబులు.

ఉ- అందు- న- అని రెండువర్ణకంబులు.

౩౧ ప్ర- వానిలోనేది యెక్కడనే వచనంబున వచ్చును.

ఉ- అందు- అనునది- అన్నిశబ్దంబులమీఁద రెండు వచనంబులయందు వచ్చును. న- అనునది ఉకారాంత జడవాచకంబుల మీఁద నేక వచనంబునందే వచ్చును.

౩౨ ప్ర- రెండువచనంబులయందును వచ్చు విభక్తులకు నేక వచనంబునఁ బూర్వాగమంబెక్కడ నేమి వచ్చును.

ఉ- మహచ్ఛబ్దంబుల మీఁదనా విభక్తులకు నేకవచనంబున వికల్పముగా ని అను నాగమంబు వచ్చును.

౩౩ ప్ర- మఱియెద్దియేని గలదా.

ఉ- ఉకార- ఋకారములకుఁ బరముగానున్న కువర్ణకంబునకు ముందుగా నకారాగమము వచ్చును.

౩౪ ప్ర- ఆవిభక్తులకు బహువచనంబున నెద్దియేని నాగమము వచ్చునా.

ఉ- ఎల్లశబ్దములమీఁద లాగమంబు వచ్చును.

౩౫ ప్ర- అకారాంత మహచ్ఛబ్దంబులకు నన్నివిభక్తులయందు నేకార్యము వచ్చును.

ఉ- ఉకారంబు వచ్చును.

౩౬ ప్ర- దానికి యుదాహరణంబేది.

ఉ- దేవ- అనునది అకారాంత మహచ్ఛబ్దంబు- దానికి- ఉకారంబు రాఁగా- దేవు- అనునది యుదాహరణంబు.

౩౭ ప్ర- దేవు- అనెడి ప్రకృతిమీఁదఁ గేవల ప్రథమయందు రూపంబు లేలాగు.

ఉ- ఏకవచనంబున డువర్ణకమును దానికి ముందు పూర్ణానుస్వారమును రాఁగా దేవుండు- దేవుఁడు అని రెండు రూపంబులు- బహువచనంబున- లువర్ణకము రాఁగా దేవులు అని రూపంబు.

౩౮ ప్ర- ఆ ప్రకృతిమీఁద సంబోధన ప్రథమయందు రూపంబు లేలాగు.

ఉ- ఏకవచనంబున డువర్ణకము వికల్పముగా నది వచ్చునపుడును రానపుడును- అదాగమమును దానికి వికల్పముగా దీర్ఘంబును వచ్చి- దేవుండ- దేవుండా- దేవుఁడ- దేవుఁడా- దేవ- దేవా- అని యాఱు రూపంబులు- బహువచనంబున లువర్ణకమును ఆరాగమంబును రాఁగా- దేవులార- దేవులారా యని రెండు రూపంబులు.

౩౯ ప్ర- ఆ ప్రకృతిమీఁద ద్వితీయయందు రూపంబు లేలాగు.

ఉ- ఏకవచనంబున నివర్ణకంబు వికల్పముగా నది వచ్చునపుడు - దేవు

నిన్ అనియు రానపుడు దేవున్ అని యును-ఆవచనంబునందే కూర్చికుఱించి- అనువర్ణకంబులు వచ్చునపుడు వికల్పముగా - న్యాగమంబును నకారాగమసంధియును - వచ్చుటచేత దేవునిఁగూర్చి దేవునింగూర్చి-దేవుఁగూర్చి-దేవుంగూర్చి- దేవునింగుఱించి-దేవునిఁగుఱించి-దేవుంగుఱించి దేవుఁగుఱించి అని పదిరూపంబులు- బహువచనంబున లవర్ణకము వచ్చి దానిమీఁద ప్రకృతము రాఁగా దేవులన్-అని యు-ఆవచనమునందె కూర్చి కుఱించి వర్ణకములు వచ్చునపుడు లాగమంబు వచ్చి- దేవులఁగూర్చి దేవులంగూర్చి-దేవులఁగుఱించి-దేవులంగుఱించి-అని యైదురూపంబులు.

౧౦ ప్ర-ఆప్రకృతిమీఁదఁ దృతీయయందురూపంబులేలాగు.

ఉ-ఏకవచనంబున-చే-చేత-తో తోడ- అనువర్ణకంబులు వచ్చునపుడు న్యాగమవికల్పము చేత - దేవునిచేన్-దేవుచేన్-దేవునిచేతన్-దేవుచేతన్-దేవునితోన్-దేవుతోన్ దేవునితోడన్- దేవుతోడన్-అని యెనిమిదిరూపంబులు - బహువచనంబున ఆనాలుగు వర్ణకములువచ్చి-లాగమంబు నిత్యముగ వచ్చుటచేత-దేవులచేన్-దేవులచేతన్- దేవులతోన్- దేవులతోడన్-అని నాల్గు రూపంబులు.

౧౧ ప్ర-ఆప్రకృతిమీఁదఁ జతుర్థియందురూపంబులేలాగు.

ఉ-ఏకవచనంబున-కయి కొఱకు అను వర్ణకములు వచ్చి న్యాగమము వికల్పముగ రాఁగా- దేవునికయి-దేవుకయి-దేవునికొఱకున్-దేవుకొఱకున్-అని నాల్గు రూపంబులు-బహువచనంబున- ఆవర్ణకములు వచ్చి-లాగమంబు నిత్యముగ వచ్చుటచేత - దేవులకయి-దేవులకొఱకున్- అని రెండురూపంబులు-కయికళ.

౧౨ ప్ర-ఆప్రకృతమీఁదఁ బంచమియందురూపంబులేలాగు.

ఉ-ఏకవచనంబున-వలన-కంటె అనువర్ణకంబులు వచ్చుచుండఁగా న్యాగమవికల్పము చేత- దేవునివలనన్-దేవువలనన్- దేవునికంటెన్ దేవుకంటెన్ - అని నాల్గురూపంబులు-బహువచనంబున ఆవర్ణకంబులు వచ్చుచుండఁగా - లాగమంబు నిత్యముగా వచ్చుటచేత-దేవులకంటెన్ దేవులవలనన్-అని రెండురూపంబులు- షష్ఠీతరములు ద్రుతప్రకృతికములు.

౧౩ ప్ర- షష్ఠియనువర్ణకము దేనికివచ్చును.

ఉ-గుణవాచకముల మీఁద హేత్వర్థమునందు వచ్చును-షష్ఠిపరముగునపుడు నాగమసంధి రాఁగా జ్ఞానముఁబట్టి-జ్ఞానముంబట్టి ఇత్యాదులుదాహరణములు.

౧౪ ప్ర- ఆప్రకృతిమీఁద షష్ఠి

యందురూపంబులేలాగు.

ఉ-ఏకవచనంబు నన్యాగమంబు రాఁగా-ఇకారాంతమాటచేతఁగివర్ణకంబువచ్చి- దేవునికిన్ అనియును న్యాగమము రానపుడు ఉకారాంత మాటచేత గువర్ణకంబువచ్చి అపుడు నాగమంబువచ్చుటచేత దేవునకున్ అనియును-యొక్క- వర్ణకంబువచ్చినపుడు - న్యాగమంబు రాఁగా- దేవుని యొక్క- దేవు యొక్క-అనియును నాలుగురూపంబులు - బహువచనంబున-లో- లోపల-కు-యొక్క- అను వర్ణకంబులును వానికి లాగమంబును వచ్చి- దేవులలోన్- దేవులలోపలన్- దేవులకున్ - దేవులయొక్క- అని నాల్గురూపంబులు- యొక్కేతరములు ద్రుతప్రకృతికములు.

౪౫ ప్ర-ఆప్రకృతి యేఁదన స్త్రమియందురూపంబు లేలాగు.

ఉ-ఏకవచనంబున అందు వర్ణకము రాఁగా-న్యాగమంబువచ్చినపుడు- దేవునియందున్ న్యాగమంబు రానపుడు-నకారాగమసంధివచ్చి- దేవునందున్-అనిరెండురూపంబులు-బహువచనంబున నావర్ణకమే రాఁగా లాగమంబువచ్చి వికల్పముగా సంధివచ్చుటచేత- దేవులందున్ - దేవులయందున్-అని రెండు రూపంబులు.

౪౬ ప్ర- అకారాంత మహచ్ఛబ్దంబులలో నెక్కడనేమి విశేషంబు.

ఉ-లాంతంబునకు ప్రథమాబహువచనంబునందును- ద్వితీయాబహువచనంబునందును-రు-ర-వర్ణకంబులును - తక్కిన బహువచనంబుల యందు- లాగమంబును రాఁగా-బాలురు- బాలురన్ - బాలురచేతన్- అని విశేషంబుగలుగు.

౪౭ ప్ర-వానిలో మఱియు నెక్కడనేమి విశేషంబు- దానిరూపంబు లేలాగు.

ఉ-సురశబ్దంబునకు నన్నివిభక్తులయందును-ఏకవచనంబును ఉకారంబును-లేవు-సురలు-సురలన్-సురలచేతన్-అనిరూపంబులు.

౪౮ ప్ర-వానిలోఁ దద్భవశబ్దంబులకురూపంబు లేలాగు.

ఉ- వానికి- చందురుఁడు-చందురుండు- చందురులు-అని దేవశబ్దంబునకుంబోలె రూపంబులు.

౪౯ ప్ర - వానిలోఁ దెనుఁగుశబ్దంబులకు నెక్కడనేమి విశేషంబు.

ఉ- వానికి నన్నివిభక్తులయందు- ఏకారాదులకు ఉకారము రాదు.

౫౦ ప్ర- ఏకారాదిశబ్దంబులనఁగా నేవి.

ఉ-ఒక్కండు-మగఁడు- అతఁడు ఇతఁడు- ఎవ్వఁడు-గొల్లఁడు-మనుమఁడు-అబ్బఁడు-అప్పఁడు-మిండఁడు-గండఁడు - ఇత్యాదులును-మంగఁడు-సింగఁడు-గంగఁడు- ఎల్లఁడు దుగ్గఁడు- ఇత్యాదిజన నామంబులును ఏకారాదులు.

౫౧ ప్ర-వానిలో నేమి విశేషము.

ఉ- అన్నాదులకుఁ బ్రథమైకవచనలోపము విశేషంబు.

౫౨ ప్ర-అన్నాదిశబ్దంబు లేవి.

ఉ- అన్న-అప్ప-అయ్య-మొదలలయినవి.

౫౩ ప్ర-ఆకారాంతమహచ్ఛబ్దంబులకు నన్ని విభక్తులయందు నేమి విశేషంబగు వేఁగురూపంబులు.

ఉ- అన్ని విభక్తులయందు హ్రస్వంబు విశేషంబగు కార్యంబు- విశ్వుఁడు-విశ్వులు-అని దేవశబ్దంబునకుంబోలె రూపంబులు.

౫౪ ప్ర-ఆకారాంతంబులగు నమహచ్ఛబ్దంబులకుఁ బ్రథమైకవచనంబు దక్కఁ దక్కిన విభక్తులయందు నంతట నేమి కార్యంబు వచ్చును.

ఉ- ప్రథమైక వచనంబున వచ్చు ము వర్ణకమును దానిపై వచ్చు-ము-బు-వర్ణకములును-అపుడు పూర్వము వర్ణకమునకు - వచ్చు సంశ్లేష బిందువులును-తక్కిన విభక్తులయందు నన్నిట నాగమంబులుగ వచ్చును.

౫౫ ప్ర-అకారాంతామహచ్ఛబ్దంబగు వనశబ్దంబునకుఁ గేవల ప్రథమయందు రూపంబు లేలాగు.

ఉ- ఏకవచనంబున-వనము- వనమ్ము- వనంబు- అని మూఁడు రూపంబులు- బహువచనంబున-వనములు వనమ్ములు-వనంబులు అని మూఁడు రూపంబులు.

౫౬ ప్ర-దానికి సంబోధన ప్రథమయందు రూపంబు లేలాగు.

ఉ- ఏకవచనంబున- వనమ- వనమా-వనమ్మ-వనమ్మా-వనంబ- వనంబా-అని యాఱు రూపంబులు-బహువచనంబున-వనములార వనములారా- వనమ్ములార- వనమ్ములారా- వనంబులార - వనంబులారా- అని యాఱు రూపంబులు.

౫౭ ప్ర-దానికి ద్వితీయయందు రూపంబు లేలాగు.

ఉ-ఏకవచనంబున- వనమును-వనమ్మును-వనంబును-వనమును గూర్చి వనమ్మును గూర్చి-వనంబును గూర్చి- వనమును గుఱించి - వనమ్మును గుఱించి- వనంబును గుఱించి యని తొమ్మిది రూపంబులు - బహువచనంబున వనములను వనమ్ములను - వనంబులను వనములఁ గూర్చి-వనమ్ములఁ గూర్చి-వనంబులఁ గూర్చి-వనములఁ గుఱించి-వనమ్ములఁ గుఱించి- వనంబులఁ గుఱించి-అని తొమ్మిది రూపంబులు.

౫౮ ప్ర-దానికిఁ దృతీయయందు రూపంబు లేలాగు.

ఉ-వనముచేఁ-వనమ్ముచేఁ-వనంబుచేఁ - వనముచేతఁ - వనమ్ముచేతఁ-వనంబుచేతఁ-వనముతోఁ - వనమ్ముతోఁ - వనంబుతోఁ - వనముతోడఁ- వనమ్ముతోడఁ - వనంబుతోడఁ-అని పండ్రెండు రూపంబులు- బహువచనం

బున - వనములచేన్ - వనమ్ములచేన్ - వనంబులచేన్ - ఈలాగె చే తాది వర్ణకంబులయందును - రాఁగాఁ బండ్రెండు రూపంబులు.

౫౯ ప్ర - దానికిఁ జతుర్థియందు రూపంబులేలాగు.

ఉ - ఏకవచనంబున - వనముకై - వనమ్ముకై - వనంబుకై ఈలాగె కొఱకు వర్ణకంబునందును రాఁగా నాఱు రూపంబులు - బహువచనంబున - వనములకై - వనమ్ములకై - వనంబులకై - ఈలాగే - కొఱకు వర్ణకంబునందును రాఁగా నాఱు రూపంబులు.

౬౦ ప్ర - దానికిఁ బంచమియందు రూపంబులేలాగు.

ఉ - ఏక వచనంబున వనముకంటెన్ - వనమ్ముకంటెన్ - వనంబుకంటెన్ - అని ఈలాగె - వలన - వర్ణకంబునందును రాఁగా నాఱు రూపంబులు - బహువచనంబున - వనములకంటెన్ - వనమ్ములకంటెన్ - వనంబులకంటెన్ - అని ఈలాగె వలన వర్ణకంబునందును రాఁగా నాఱు రూపంబులు.

౬౧ ప్ర - దానికి షష్ఠియందు రూపంబులేలాగు.

ఉ - ఏక వచనంబున - వనమునకున్ - వనమ్మునకున్ - వనంబునకున్ - అని ఈలాగె యొక్క - వర్ణకంబునందును రాఁగా నాఱు రూపంబులు - ఇదియు కారాంతము గానఁ గివర్ణకము రాదు ఏకవచనము గాన - లో లోపములు రావు - బహువచనంబున - వనములకున్. వనమ్ములకున్ - వనంబులకున్ - అని యీలాగె - యొక్క - లో లోపల - వర్ణకంబుల యందును - రాఁగాఁ బండ్రెండు రూపంబులు.

౬౨ ప్ర - దానికి సప్తమియందు రూపంబులేలాగు.

ఉ - ఏకవచనంబున - వనమునందున్ - వనమ్మునందున్ - వనంబునందున్ - అని నాగమము వికల్పము గాన - వనమందున్ - వనమ్మందున్ - వనంబందున్ - అనియు ఈలాగె న వర్ణకంబునందు - వనమునన్ - వనమ్మునన్ - వనంబునన్ - అని రాఁగాఁ దొమ్మిది రూపంబులు - బహువచనంబున - వనములయందున్ - వనములందున్ - వనమ్ములయందున్ - వనమ్ములందున్ - వనంబులయందున్ - వనంబులందున్ - అని యాఱు రూపంబులు.

౬౩ ప్ర - వానిలో నేమి విశేషంబు.

ఉ - లాజలు - అక్షతలు - మొదలగు శబ్దంబులకు నన్ని విభక్తులయందు బహువచనము మాత్రమే కలదు - ఆ చోటను - ముబ్వాద్యాగమంబులు లేవు.

౬౪ ప్ర - వానిలో మఱియు నేమి విశేషంబు.

ఉ - కుశ - దర్భ - చరిత్ర - వధ - అను

నని మొదలగువానికిఁ బ్రథమైకవచ
నలోపము వచ్చును - తక్కిన విభక్తుల
లయందు - ముబ్వాద్యాగమంబులు
రావు.

౬౫ ప్ర-వానిలోన చ్చ తెనుఁగు
శబ్దంబు లెన్ని విధంబులు గలవి.

ఉ-వనసమంబులనియు - కుశస
మంబులనియు రెండు విధములు గలవి

౬౬ ప్ర - వనసమంబులకుఁ గా
ర్యంబులు నురూపంబులు నేలాగు.

ఉ- గుఱ్ఱము - పల్లము - అందము -
చందము - అనునవి మొదలగు వన
సమంబులకు - వనశబ్దమునకుంబో
లెఁ గార్యంబులు రూపంబులు నెఱుఁ
గునది.

౬౭ ప్ర- కుశసమంబులకుఁ గా
ర్యంబులును రూపంబులు నెట్టివి.

ఉ-గోడ-మేడ-కన్నియ-ముత్తై
దువ- ఇవి మొదలగు కుశసమంబుల
కుఁ గుశాదులకుంబోలెఁ గార్యంబు
లును రూపంబులు నెఱుంగునది.

౬౮ ప్ర-వానిలో నియాంతంబు
లగు వనసమంబులకును - కుశసమం
బులకును నేమి విశేషంబు.

ఉ - వానికిఁ నన్నివిభక్తులయందు
నొకపక్షంబున ఎకారము నొకచో
టను నికారలోపమును వచ్చును.

౬౯ ప్ర - దానికినుదాహరణం
బులేలాగు.

ఉ- ముత్తియము - ముత్తెము - ము
త్యము - అని వనసమంబులకును - క
న్నియ-కన్నె-అని కుశసమంబులకు
నుదాహరణంబులు.

౭౦ ప్ర-వానిలో దేశ్యంబులగు క
త్తెరాదిశబ్దంబులకు నెక్కడెక్కడ
నేమి విశేషంబు.

ఉ- వానికినుకారంబు గక్కఁదక్కి
నమహచ్ఛబ్ద కార్యంబులు అక్కడ
క్కడ వచ్చును.

౭౧ ప్ర - వానికినుదాహరణం
బులెట్లు.

ఉ - కత్తెరఁడు - కైరని చేతన
డిచెన్ - వననొక్కనిఁజూచెన్ -
అని యీలాగున నుదాహరణం
బులు.

౭౨ ప్ర-జోంపము-మొదలగు శ
బ్దంబులకు నేమి విశేషము.

ఉ-వానికి బహువచనంబులయం
దు నొకపక్షంబున ముబ్వాద్యాగమం
బులు లోపించి-పూర్వమందున్నయ
కారమునకు దీర్ఘంబు వచ్చు-జోంపా
లు-జోంపాలన్-జోంపాలచేతన్-
మీసాలు-మీసాలన్-మీసాలకున్
అని యీలాగున రూపంబులు విశే
షంబు.

౭౩ ప్ర-ఆకారాంతామహచ్ఛ
బ్దములకు నన్నివిభక్తులయందు నే
కార్యంబు వచ్చును.

ఉ- వానిలో నేకాక్షరములగు త
త్సమశబ్దంబులును దేశ్యంబులును ద
క్కఁదక్కిన వానికి నన్నివిభక్తుల
యందు హ్రస్వంబు వచ్చును.

౨౪ ప్ర- వానికి నన్నిటికి నే శబ్దంబులకుం బోలెఁ గార్యములు వచ్చును

ఉ- వానికిఁ గుశాదులకుం బోలెఁ గార్యంబులు వచ్చును.

౨౫ ప్ర- వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ- త్మా-త్మాలు-త్మాను-త్మాలఁ-త్మా చేతఁ-త్మా చేతఁ-అని యేకాక్షర తత్సమంబులకు నుదాహరణంబులు నేజా-నేజాలు-నేజాను-నేజాలఁ-నేజా చేతఁ-నేజాల చేతఁ-అని దేశ్య శబ్దంబులకు నుదాహరణంబులు-వనిత-వనితలు-వనితను-వనితలఁ-వనిత చేతఁ-వనితల చేతఁ-అని తక్కిన వానికి నుదాహరణంబులు.

*౨౬ ప్ర- ఇకారాంత మహదమహచ్ఛబ్దంబులకు నెక్కుడెక్కుడ నేమి విశేషంబు.

ఉ- వానికిఁ బ్రథమైకవచనలోపమును బహువచనంబులయందు నంతట నుకారంబును వచ్చును- సంబోధనమునందు దీర్ఘము వికల్పముగ వచ్చును- అదాగమంబు రాదు- తృతీయాద్యేక వచనంబులయందు న్యాగమంబు రాదు.

౨౭ ప్ర- వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ- హరి-గిరి-భావి-మోవి-హరులు-గిరులు-భావులు-మోవులు-ఓహరి-ఓహరీ-ఓగిరి-ఓగిరీ-ఓబావి-ఓబావీ-ఓమోవి-ఓమోవీ-హరిని-గిరిని-బావిని-మోవిని-హరిచేతఁ-గిరిచేతఁ-బావిచేతఁ-మోవిచేతఁ అని ఈలాగున నుదాహరణంబులు.

౨౮ ప్ర- వానిలో నికారాంతంబులగునంత్యోపాంత్యంబులు గలతెనుఁగు శబ్దంబులకు నేమి విశేషంబు.

ఉ- వానియొక్క యుపాంత్యమైన యుకారంబునకును బహువచనంబున నుకారంబు వచ్చును.

౨౯ ప్ర- వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ- బలిమి-బలుములు-కలిమి-కలుములు-చెలిమి-చెలుములు-ములికి-ములుకులు-ఇత్యాదులు.

౩౦ ప్ర- వానిలో డి-లి-టి-వర్ణాంతంబులగు తెనుఁగు శబ్దంబులకు నెక్కుడ నేమి విశేషంబు.

ఉ- వానియొక్క తుదనున్న యికారమునకు బహువచనంబులయందు లోపము వికల్పముగ వచ్చును- అప్పుడు- డకారలకారములకు- ళకారము వచ్చును.

౩౧ ప్ర- వానికి నుదాహరణంబు లేలాగు

ఉ- పాడి-పాళ్లు-పాడులు-అంబలి అంబళ్లు-అంబళులు- జెట్టి-జెట్లు-జెట్టులు-అని ఈలాగున నుదాహరణంబులు.

౩౨ ప్ర- ఆలి వర్ణాంతంబులలో టింట్యాదులకు విషయంబులగు- కొడవలి మొదలగువానికి నటిలో

న్నిటికిని యేమివిశేషంబు.

ఉ-వానికి బహు వచనంబుల యందుఁడుదనున్నలివర్ణకమునకు పూర్ణబిందువుతోఁ గూడిన డకారము వచ్చును.

౬౩ ప్ర- వానికి నుదాహరణంబులేలాగు.

ఉ-కొడవలి-కొడవండ్లు-గుద్దలి-గుద్దండ్లు-రోకలి-రోకండ్లు-అటకలి అటకండ్లు-పెండిలి-పెండిండ్లు-ఇవి మొదలయినవి యుదాహరణంబులు.

౬౪ ప్ర-వానిలో లువర్ణకము మీఁదలువర్ణకంబెక్కుడవచ్చును.

ఉ-మొసళ్లులు-నీళ్లులు-ఇవి మొదలయినకొన్నిచోట్లవచ్చును.

౬౫ ప్ర-నీనిలో సప్తమీ తృతీయార్థములయందు అకారంబెక్కుడవచ్చును.

ఉ-కొడవలి-మొదలగుశబ్దములకు కొక్కుటింట్యాదులకువచ్చును.

౬౬ ప్ర-వానికి నుదాహరణంబేలాగు.

ఉ-కొడవంటన్-రోకటన్-ఇవి మొదలైనవి యుదాహరణంబులు.

౬౭ ప్ర-ఈకారాంతమహదమహచ్ఛబ్దంబులకు నన్నివిభక్తులయందు నేమివిశేషంబు.

ఉ- వానిలో నేకాక్షరతత్సమశబ్దంబులును దేశ్యశబ్దంబులును దక్కఁ దక్కిన వానికి నన్నివిభక్తులయందు నుహ్రస్వంబువచ్చును.

౬౮ ప్ర-వానికిరూపంబులేలాగు.

ఉ-ఏకాక్షరంబులగుశ్రీ-స్త్రీ-ధీ శబ్దములు-మొదలగువానికిని దేశ్యశబ్దంబులగు-గాడీ-లకోరి-మొదలగువానికిని-స్త్రీశబ్దనేఞా శబ్దములకుంబోలెను-తక్కిన సేనానీ-తరుణీ శబ్దములు మొదలగు వానికి గౌరిశబ్దమునకుంబోలెను-రూపంబులు-ఈకారాంతములకు షష్ఠ్యేకవచనమునఁగివర్ణకమేవచ్చును. శ్రీకిన్ ఇత్యాది.

౬౯ ప్ర-ఊకారాంతమహదమహచ్ఛబ్దంబులకు నన్నివిభక్తులయందు నేమికార్యంబువచ్చును.

ఉ-మువర్ణకమువలెఁబ్రథమైకవచనము నందు వచ్చువువర్ణకమే యన్నివిభక్తులయందు నాగమంబుగవచ్చును.

౭౦ ప్ర-వానిలో మహచ్ఛబ్దంబులకు నెక్కుడ నేమివిశేషంబు.

ఉ-ప్రథమైక వచనమునందు నొకపక్షంబున-డువర్ణకమును-సంబోధనప్రథమైకవచనమునందు నొకపక్షంబున డువర్ణకాద్యాగమంబులును ఒకపక్షంబున వువర్ణకాద్యాగమంబులును ఒకపక్షంబున ప్లుతమును విశేషంబు.

౭౧ ప్ర-వానికిరూపంబులేలాగు

ఉ-మహచ్ఛబ్దంబులకు-గురువు-గురుఁడు-ఓగురుఁడ-ఓగురువ-ఓ

గురువా - ఓగురుఁడ - ఓగురుఁడా - ఓగురూ - ౩ - ఓగురువులార - ఓగురులారా అని ఈలాగే తక్కిన రూపంబులను జూడఁదగినవి - అమహచ్ఛబ్దంబులకు - ధేనువు - ధేనువులు - ఓధేనువ - ఓధేనువా - ఓధేనువులార - అని ఈలాగే తక్కిన రూపంబులను - జూడఁదగినవి.

౯౨ ప్ర - ఉకారాంతంబులగు తెనుఁగుశబ్దంబులకుఁ గార్యంబులు నరూపంబులు నేలాగు.

ఉ - మోము - మోపు - దాపు - వీఁపు ఇవి మొదలగు నాశబ్దంబులకుఁ గుశాదులకుంబోలెఁ గార్యంబులును రూపంబులు నెఱుంగునది.

౯౩ ప్ర - వీనిలోన - నువర్ణాంతంబులకు నేమివిశేషంబు.

ఉ - వానినువర్ణమునకు బహువచనంబులయందుఁ గొన్నియెడల బిందుపూర్వకమైన కువర్ణకమును గొన్నియెడల లోపమును వచ్చును - కొన్నియెడల రెండును రావు.

౯౪ ప్ర - వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ - కొలను - కొలంకులు - కొలఁకులు - కెలను - కెలంకులు - కెలఁకులు - మ్రాను - మ్రాఁకులు - ఇవి నువర్ణమునకు కువర్ణము వచ్చుటకును దాహరణంబులు - చేను - చేలు - మీను - మీలు - పేను - పేలు - ఇవి నువర్ణమునకు లోపము వచ్చుటకును దాహరణంబులు - మేను - మేనులు - కాను - కానులు - తీను - తీనులు - ఇవి యీ రెండును రామికి నుదాహరణంబులు ఇచట - రేను - గోను - శబ్దంబులు - రేఁగు - గోఁగు - అని వ్యవహరింపఁబడుచున్నవి - వానికి - రేఁగు - రేఁగులు - గోఁగు - గోఁగులు - అని యీలాగే తక్కిన రూపంబులను జూడఁదగినవి.

౯౫ ప్ర - వానిలో రువర్ణ డువర్ణ లువర్ణ టువర్ణములంతమునందుఁగలశబ్దములకు నేమివిశేషంబు.

ఉ - వాని రువర్ణ డువర్ణ లువర్ణ టువర్ణములకు లువర్ణకంబులు పరంబులగునపుడు ఉకారలోపమును ఆశేష డకార లకారములకు ళకారమును వికల్పముగ వచ్చును.

౯౬ ప్ర - వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ - కోరు - కోళ్లు - కోళులు - కోరులు - త్రాడు - త్రాళ్లు - త్రాళులు త్రాడులు - చాలు - చాళ్లు - చాళులు చాలులు - చెట్టు - చెట్లు - చెట్టులు - అని యీలాగున నుదాహరణంబులు.

౯౭ ప్ర - వానిలో ద్విత్వముతోఁ గూడిన లువర్ణాంతంబులకు నేమివిశేషంబు.

ఉ - వానికి - లు - అ - వర్ణకంబులు పరంబులగునపుడు ల్లువర్ణమునకుఁ బూర్ణబిందుపూర్వకమైన డువర్ణమును - ఆ డువర్ణము యొక్క యుకారమునకు లోపమును వికల్పముగ వచ్చును.

౯౮ ప్ర-వానికినుదాహరణంబు
లేలాగు.

ఉ-విల్లు- విండ్లు- విండులు-విల్లు
లు-విండ్లన్-విండులన్-విల్లులన్-
విండ్లచేతన్ - విండులచేతన్-విల్లు
లచేతన్-అని యీలాగే- ముల్లు-ప
ల్లు-మొదలగువానికి నుదాహరణం
బులు.

౯౯ ప్ర-వానిలో ఆల్వాదులకు
నేమివిశేషంబు.

ఉ-వానితుదనున్న లువర్ణము న
కు- లు- లవర్ణకంబులు పరంబులగు-
నపుడు బిందువుతోఁగూడిన డువర్ణ
కము న ఆ-ను వర్ణము యొక్క యు
కారమునకు లోపమును నిత్యముగ
వచ్చును-అపుడా లులవర్ణకములకు-
రురవర్ణకములు వచ్చును.

౧౦౦ ప్ర - వానికినుదాహరణం
బులేలాగు.

ఉ - ఆలు-ఆండ్రు-ఆండ్రన్-
-ఈలాగే- జవరాలు-కోడలు- చెల్లె
లు-వాఁడు-[illegible]-కాఁడు- ఇ
వి మొదలగువానికినిరూపంబులు.

౧౦౧ ప్ర-వానిలో లువర్ణకము
మీఁదవెండియు లువర్ణకం బెక్కు
డువచ్చును.

ఉ-లువర్ణకము పూర్వవర్ణము
తోసంశ్లిష్టమగు నపుడుకొన్ని యెడ
లవెండియు లువర్ణకంబు వికల్పముగ
వచ్చును.

౧౦౨ ప్ర-వానికి నుదాహరణం
బులేలాగు.

ఉ-పండ్లులు- విండ్లులు- ముండ్లు
లు-వీళ్లులు-ఇవి మొదలయినవి కొన్ని
యెడలఁజూడఁదగినవి.

౧౦౩ ప్ర-వానిలో మఱియు నె
క్కుడ నేమి విశేషంబు.

ఉ-వానిలోఁగొన్నిటికి- న-అను వి
భక్తియందు-ఉన్-అనుదానికి లో
ముఁరాఁగా-చోటన్- మీఁదన్-ఊ
రన్-నడుమన్-అని విశేషంబు.

౧౦౪ ప్ర-వానిలో మఱియు నె
క్కుడ నేమి విశేషంబు.

ఉ-టింట్యాదులకు విషయంబుల
గు వానిటికి సప్తమీతృతీయార్థ ముల
యందు నకారంబు విశేషంబు.

౧౦౫ ప్ర-వానికి నుదాహరణం
బులేలాగు.

ఉ-మింటన్-కంటన్-వింటన్-
ముంటన్-పంటన్-ఇవి మొదలయి
నవియుదాహరణంబులు.

౧౦౬ ప్ర-ఊకారాంతశబ్దంబు
లకు నన్నివిభక్తులయందు నేమివిశే
షంబు-

ఉ-వానిలో దేశ్యశబ్దంబులును.వి
కాక్షరతత్సమశబ్దంబులునుదక్కఁద
క్కినవానికి హ్రస్వంబు విశేషంబు.

౧౦౭ ప్ర-హ్రస్వమువచ్చిన శ
బ్దంబులకు రూపంబు లేలాగు

ఉ-కరభోరూ- వధూ మొదలగుశ
బ్దంబులకు ధేనుశబ్దంబునకు వలె రూ
పంబులు.

౧౦౮ ప్ర-హ్రస్వంబు రానిదేశ్య శబ్దంబులకును-ఏకారాక్షరంబులకునురూపంబు లేలాగు.

ఉ-హ్రస్వంబురానిశాలూ మొదలగుదేశ్యశబ్దంబులకును - ఏకారాక్షరంబులగు భూ శబ్దము మొదలగు వానికిని గాడీశబ్దమునకువలెరూపంబులు.

౧౦౯ ప్ర-వానిలో భూశబ్దంబునకు నేలాగురూపంబులు.

ఉ-దానికి భువియనునది ప్రకృతిగానదానికి నికారాంతంబగుగిరిశబ్దమునకువలెరూపంబులు.

౧౧౦ ప్ర-ఋకారాంత శబ్దంబులెన్నివిధంబులు గలవి.

ఉ-అవిధాత్రాదులు-విధాత్రాదులని రెండువిధంబులుగలవి.

౧౧౧ ప్ర- అవిధాత్రాదులకు రూపంబు లేలాగు.

ఉ-వానియొక్క ఋకారంబునకునన్నివిభక్తులయందు ఆకారంబువచ్చిదానికిహ్రస్వంబురాగా-భ్రాత-భ్రాతలు-కర్త-కర్తలు-అనుశాదులకువలెరూపంబులు-

౧౧౨ ప్ర-విధాత్రాదులకురూపంబు లేలాగు.

ఉ-వానికిమొక పక్షంబుననవిధాత్రాదియగుభ్రాతృశబ్దమునకువలెను - ఒకపక్షంబునన కారాంతమహచ్ఛబ్దంబగు దేవశబ్దమునకువలెనరూపంబులు.

౧౧౩ ప్ర-వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ-విధాత - విధాతలు- అనునివి మొదటిపక్షమునందును- విధాతృండు-విధాతృలు-విధాతృనిన్-విధాతృన్-విధాతృని చేతన్ - విధాతృచేతన్ - విధాతృనకున్-విధాతృనికిన్ - విధాతృనియందున్ - విధాతృనందున్అనునవి రెండవపక్షమునందునుదాహరణంబులు.

౧౧౪ ప్ర-అజంతంబులలో నేశబ్దంబులప్రసిద్ధంబులు.

ఉ - ౠకారాంతఌకారాంతౡకారాంతఏకారాంతంబులప్రసిద్ధంబులు.

౧౧౫ ప్ర-ఐకారాంతంబగురైశబ్దంబునకురూపంబు లేలాగు.

ఉ-దానికినన్నివిభక్తుల యందు నోకారంబువచ్చి- రో- రోచేతన్-అనికుశాదులకువలెరూపంబులు.

౧౧౬ ప్ర- ఓకారాంతంబగు గోశబ్దంబునకురూపంబు లేలాగు.

ఉ-దానకినన్నివిభక్తులయందువఫువర్ణాకమువచ్చి-గోవు-గోవులు అని ధేనుశబ్దంబునకు వలెరూపంబులు.

౧౧౭ ప్ర-ఔకారాంతంబగు నౌశబ్దంబునకురూపంబు లేలాగు.

ఉ-దాని యొక్క ఔకారమునకునన్నివిభక్తులయందును-అవఅనునాదేశంబువచ్చి-నావ-నావలు-నా

వచేతఙ - అనికుశావులకువ వలెరూపంబులు.

౧౧౮ ప్ర-ఔకారాంతంబగు గ్లౌశబ్దంబునకురూపంబు లేలాగు.

ఉ-దానికి- గ్లౌ- గ్లౌ చేతఙ-అనికుశాదులకువలె రూపంబులు.

అజంతప్రకరణముసమాప్తము.

---

## హలంతప్రకరణము.

౧ ప్ర-హలంతశబ్దంబు లెన్నివిధంబులుగలవి.

ఉ- అగుణవర్ధనప్రవిష్టంబులు- గుణవర్ధనప్రవిష్టంబులు- ఉభయగణప్రవిష్టంబులని- మూఁడువిధంబులుగలవి.

౨ ప్ర-వానికి నజంతంబులకువలె మహదమహద్భేదంబులును విభక్త్యాదికార్యంబులుంగలవా.

ఉ-కలవు.

౩ ప్ర-అగుణవర్ధనప్రవిష్టంబులు తెనుఁగువిభక్తులకుముందుగానేలాగుననిల్చియుండును.

ఉ-సంస్కృతప్రథమైకవచనాంతంబులతోసమంబులుగానుండును.

౪ ప్ర-వానికినన్నివిభక్తులయందు నేమివిశేషకార్యంబువచ్చును.

ఉ-వానితుదనున్నహల్లులకునన్నిటికినన్నివిభక్తులయందు ద్విత్వోత్వంబులువచ్చును-దీర్ఘముమీఁదనున్నయాహల్లులకు ద్విత్వము మాత్రముకొన్నియెడలరాదు.

౫ ప్ర-వానిలోద్విత్వముగలవానికిని ద్విత్వము లేని వానికినేమి విశేషకార్యంబు.

ఉ-ద్విత్వముగలవానికిఁ బ్రథమైకవచనలోపమువచ్చును-ద్విత్వము లేనివానికిఁగొన్నియెడలఁ ప్రథమైకవచనలోపము రాదు.

౬ ప్ర- వానికినుదాహరణంబులేలాగు.

ఉ-ఇంద్రజి త్తు-భూభృ త్తు-ఉపాన త్తు-విరాట్టు-కకుప్పు-మరు త్తు-వాక్కు-వాకు- ఇవిమొదలయినవి ప్రథమైకవచనలోపము గలవానికి నుదాహరణంబులు -వ్రశానుఁడుభగవానుఁడు-హనుమానుఁడుఇవి మొదలయినవి లోపమురానివానికినుదాహరణంబులు.

౭ ప్ర-గుణవర్ధనప్రవిష్టంబులు తెనుంగువిభక్తులకుముందుగానేలాగుననిల్చియుండును.

ఉ- సంస్కృతద్వితీయైక వచనాంతంబులతో సమంబుగా నిల్చియుండును.

౮ ప్ర-వానికిఁ గార్యంబులునరూపంబులు నేలాగు.

ఉ-వానికి నజంతంబులకు వలెమహత్త్వామహత్త్వభేదము చేతదువర్ణకము వణఙకాదికార్యంబులు వచ్చును.

౯ ప్ర-వానికి నుదాహరణంబులేలాగు.

ఉ-అనడ్వాహము - అనడ్వాహములు - గుణవంతుఁడు - గుణవంతులు - ఇత్యాదులుదాహరణంబులు.

౧౦ ప్ర- ఉభయగణ ప్రవిష్టంబులేలాగుననుండును.

ఉ-అగుణవర్గణ ప్రవిష్టంబులవలెను - గుణవర్గణప్రవిష్టంబులవలెనుండును.

౧౧ ప్ర-వానికినుదాహరణంబులేలాగు.

ఉ-హనుమానుఁడు - హనుమంతుఁడు - భగవానుఁడు - భగవంతుఁడు - ఋత్విక్కు - ఋత్విజుండు - ఇత్యాదులుదాహరణంబులు.

౧౨ ప్ర-హలంతంబులలో నెక్కడ హల్లునకులోపంబువచ్చును.

ఉ-పరోగణవ్యతిరిక్తంబులయిన నకారాంతంబులకు మఱికొన్నిటికి నిదుపనున్న హల్లునకు నన్నివిభక్తులయందు వికల్పముగా లోపమువచ్చును.

౧౩ ప్ర-వానికినుదాహరణంబులేలాగు.

ఉ-తేజము - తేజస్సు - మనము - మనస్సు - శిరము - శిరస్సు - ధనువు - ధనస్సు - ఆయువు - ఆయుస్సు - ఇత్యాదులు పరోగణవ్యతిరిక్తంబులయిన సకారాంతంబులకునుదాహరణంబులు - జగము - జగత్తు ఇత్యాదులన్యంబులకునుదాహరణంబులు.

౧౪ ప్ర- ఆత్మన్ శబంబునకును ఇమనంతంబులైన మహిమాదిశబ్దంబులకునురూపంబులేలాగు.

ఉ-వానియొక్క తుదనున్న అన్ అనుదానికిన్నివిభక్తులయందు నొకపక్షంబున ఆకారంబువచ్చి కుశాదులకువలెను మఱియొకపక్షంబున హ్రస్వంబువచ్చి వనశబ్దమునకువలెనురూపంబులు.

౧౫ ప్ర - వానికినుదాహరణంబులేలాగు.

ఉ-ఆత్మ - ఆత్మలు - మహిమ - మహిమలు - గరిమ - గరిమలు - లఘిమ - లఘిమలు - అని మొదటిపక్షమునందును - ఆత్మము - మహిమము - గరిమము - లఘిమము - అని రెండుపక్షమునందునుదాహరణంబులు - ఈపక్షమునందు - ఆత్మన్ శబ్దమునకు మహత్వవివక్షచేత - ఆత్ముఁడు - ఆత్మునిచేతన్ - అనియునురూపంబులుగలవు.

౧౬ ప్ర - రాజన్ శబ్దంబునకు రూపంబులేలాగు.

ఉ-దానియొక్క అన్ అనుదానికి ఉకారంబువచ్చి - రాజు - రాజులు - రాజుచేతన్ - అని కుశాదులకువలె రూపంబులు.

౧౭ ప్ర- అస్మచ్ఛబ్దార్థకంబగు నా అను దేశ్యశబ్దంబునకునుదానికిఁ బరంబులుగావచ్చువిభక్తులకు నెక్కడెక్కడనేమివిశేషంబులు.

ఉ-దానికిఁ బ్రథమయందు ఏకారమునుదానినకారంబునకుబహువ

చనంబులయందు మకారమును-దానికిఁబరంబులుగానున్న ప్రథమైకవచనబహువచనంబులకుఁ గ్రమంబుగా-ను-ము- అనువర్ణకంబులునుద్వితీయైకవచనంబులకుఁ గ్రమముగా-ను-న్ను-ము-మ్ము అనువర్ణకంబులును అపుడుదానికి హ్రస్వమును ఆదేశంబుగవచ్చును-తృతీయాది బహువచనంబులందులాగమంబురాదు.

౧౮ ప్ర - దానికినుదాహరణంబులేలాగు.

ఉ - నేను-మేము- ననున్- నన్నున్-మమున్-మమ్మున్-నాచేతన్-మాచేతన్- అనియీలాగుననుదాహరణంబులు.

౧౯ ప్ర- యుష్మచ్ఛబ్దార్థకంబగు-నీ-అను దేశ్యశబ్దంబునకుందానికిఁబరంబులుగావచ్చు విభక్తులకు నెక్కుడనేమివిశేషంబులు.

ఉ- దానినకారంబునకుబహువచనంబులయందు మకారమును దానికిఁబరంబులుగావచ్చు ప్రథమైకవచనబహువచనంబులకుఁ గ్రమంబుగా-వు-రు- అనువర్ణంబులునుద్వితీయైకవచనబహువచనంబులకుఁగ్రమంబుగా-ను-న్ను-ము-మ్ము-అనువర్ణకంబులును-అపుడుదానికి హ్రస్వమును- ఆదేశంబుగవచ్చును- షష్ఠియందుఁగివర్ణకంబును తృతీయాదిబహువచనంబులయందు లాగమంబునురాదు.

౨౦ ప్ర - దానికినుదాహరణంబులేలాగు.

ఉ.నీవు-మీరు-నినున్-నిన్నున్-మిమున్-మిమ్మున్-నీచేతన్-మీచేతన్-నీకొఱకున్-మీకొఱకున్-షష్ఠియందు-నీకున్-మీకున్-అనియుదాహరణంబులు.

౨౧ ప్ర - ఆత్మన్శబ్దార్థకంబగు-తా-అను దేశ్యశబ్దంబునకు నెక్కుడెక్కుడనేమేమివిశేషంబు.

ఉ- దానికిఁబరంబులగు ప్రథమాద్వితీయాసంబంధులైన యేకవచనబహువచనంబుల యందుఁ గ్రమంబుగానస్మద్యుష్మచ్ఛబ్దంబులకువలెను-తృతీయాదివిభక్తులయందు దానికి హ్రస్వమును- వచనద్వయంబునందుఁగ్రమముగా నకార మకారాగమంబులునువచ్చును.

౨౨ ప్ర - దానికినుదాహరణంబులేలాగు.

ఉ - తాను- తారు-తనున్-తన్నున్- తమున్-తమ్మున్- తనచేతన్-తమచేతన్-తనకొఱకున్-తమకొఱకున్- ఇత్యాదు లుదాహరణంబులు.

౨౩ ప్ర-ఉభయార్థవాచకంబై నిత్యబహువచనాంతంబగు-మన-అను దేశ్యశబ్దంబునకు నేమేమివిశేషంబులు-దీనికిఁ బ్రథమాబహువచనంబునఁదాము అని యు రూపంబుగలదు.

ఉ-దానికిఁబ్రథమాబహువచనం
బునందు-మువర్ణకమును-ద్వితీయా
బహువచనంబునందు లవర్ణకము
ను-తక్కినబహువచనంబులయం
దు లాగమాభావమును విశేషంబులు.

౨౪ ప్ర-దానికినుదాహరణంబు
లేలాగు.

ఉ - మనము-మనల౯-మనచే
త౯-మనకొఱకు౯ ఇత్యాదులుదా
హరణంబులు.

౨౫ ప్ర- అచ్చతెనుఁగుశబ్దంబు
లయందు నెట్టిహలంతంబులున్నవి.

ఉ-కొన్నియుకారాంతేకారాం
తంబులంత్యవర్ణములోపించి ప్రథ
మైకవచన బహువచనమాత్రంబున
హలంతంబుగానున్నవి.

౨౬ ప్ర - దానికిముదాహరణం
బులేలాగు.

ఉ- కన్ దెఱచి-చన్ గుడిచి-కల్
ద్రావి-విల్ పూని-పేర్ వాడి-గోర్
మోపి-ఇత్యాదులును-పందిళ్ వేసి-
అంబళ్ గాఁచి-ఇత్యాదులునుదాహ
రణంబులు.

హలంతప్రకరణముసమాప్తము,
ఇదిశబ్దపరిచ్ఛేదము.

---

## కారకాదిపరిచ్ఛేదము.

౧ ప్ర - కారకాదిపరిచ్ఛేదము
నందు నెన్నిప్రకరణంబులు.

ఉ - విభక్తిప్రకరణంబనియు-స
మాసప్రకరణంబనియు- మిశ్రప్ర
కరణంబనియును మూఁడు ప్రకర
ణంబులు.

---

## విభక్తిప్రకరణంబు.

౧ ప్ర- విభక్తిప్రకరణంబనఁగా
నెట్టిది.

ఉ-విభక్తులకునర్థమును దెలుపు
టయును - వానికివ్యత్యాసమును దె
లుపుటయును-విభక్తిప్రకరణంబనఁ
బడును.

౨ ప్ర-ఏయే యర్థమునందు నే
యేవిభక్తివచ్చును.

ఉ-నామార్థమునందునుసంబోధన
మునందును బ్రథమయును- కర్మార్థ
మునందుద్వితీయయు - కర్తృకర
ణార్థములయందుఁదృతీయయు-సం
ప్రదానార్థమునందును-తాదర్థ్య
మునందును - చతుర్థియు- అపాదా
నార్థమునందుఁబంచమియు-సంబం
ధార్థమునందుషష్ఠియు-అధికరణా
ర్థమునందుసప్తమియువచ్చును.

౩ ప్ర - మఱిద్వితీయ యేయర్థ
మునందువచ్చును.

ఉ- కర్మప్రవచనీయార్థము
నందువచ్చును-దానికి- జపముంగూ
ర్చివర్షించెను - అనునది మొదల
యినవియుదాహరణంబులు.

౪ ప్ర-తో-తోడ- అనుతృతీయ
లేయర్థమునందువచ్చును.

ఉ-సహార్థమునందువచ్చును-దాని
కిఁబుత్రునితోడవచ్చెనుదండ్రియ

నుసది మొదలయినవి యుదాహరణంబులు.

౫ ప్ర-పట్టియనుపంచమియొక్కడవచ్చును.

ఉ-గుణరూపమగు హేతువునజెప్పుశబ్దంబుమీఁదవచ్చును-దానికిజ్ఞానముఁబట్టిముక్తుఁడు-జాడ్యముఁబట్టిబద్ధుఁడు - ఇనిమొదలయినవియుదాహరణంబులు.

౬ ప్ర-కంటె- అనుపంచమి యొక్కడవచ్చును.

ఉ- అన్యార్థకంబులును సమీపార్థకంబులునుదిగ్వాచకంబులును మొదలగుశబ్దంబులతో నన్వయించు శబ్దంబులమీఁదవచ్చును-దానికిఘటంబుకంటె నన్యంబుపటంబు ఊరికంటె చేరువవనంబు-గ్రామముకంటె తూరుపునగరంబు-ఇవిమొదలయినవియుదాహరణంబులు.

౭ ప్ర-లో-లోపల- అనుషష్ఠులు వియర్థమునందువచ్చును.

ఉ-ఒకగుంపునుండియొకవస్తువును వేఱుపఱిచి చెప్పుటయందువచ్చును- దానికి - ఆవులలోనల్లావుపాలిచ్చును - భృత్యులలోపలరంగఁడుసమర్థుండు - ఇవిమొదలయినవియుదాహరణంబులు.

౮ ప్ర-విషయ నిమిత్తాదిసప్తములువియర్థమునందువచ్చును.

ఉ - విషయనిమిత్తాద్యర్థములయందువచ్చును-వానికి ఈశ్వరువిషయముభక్తి- చర్మమునిమిత్తముపులినిజంపెను-గొల్లఁడావునుబితుకంగవచ్చె-అనియుదాహరణంబులు.

౯ ప్ర-విభక్తులకువ్యత్యాసమెట్టిది

ఉ-ఒకవిభక్తితనచోటువిడిచి-మఱియొకచోటవచ్చుట విభక్తి వ్యత్యాసము.

౧౦ ప్ర-ప్రథమతనచోటువిడిచి మఱియేచోటవచ్చును.

ఉ-ద్వితీయార్థమునందువర్తించుచున్నజడవాచకంబులమీఁదవచ్చును.

౧౧ ప్ర-దానికినుదాహరణంబులేలాగు.

ఉ-రథమెక్కెను- వనముచూచెను - ఇనిమొదలయినవి యుదాహరణంబులు.

౧౨ ప్ర-ద్వితీయతనచోటువిడిచిమఱియొక్కడవచ్చును.

ఉ-జడవాచకంబులమీఁదఁదృతీయాసప్తమ్యర్థములయందువచ్చును-

౧౩ ప్ర-దానికినుదాహరణంబులేలాగు.

ఉ-హేతినినఱికెను-ఇదితృతీయార్థమునందు- ద్వారకనున్నవాఁడు-ఇదిసప్తమ్యర్థమునందు- ద్వితీయవచ్చుటకునుదాహరణంబులు.

౧౪ ప్ర-మఱియునే విభక్తులు వ్యత్యాసముగావచ్చును.

ఉ-అన్నివిభక్తులునొక్కొక్కడిక్కునవ్యత్యాసముగావచ్చును.

౧౫ ప్ర-వానికినుదాహరణంబు

లేలాగు.

ఉ-దేవుఁడు నాకు వరమిచ్చెను-ఇచటఁ జతుర్థ్యర్థంబునందు షష్ఠి-శిరమున గురు పాదుకలు వహించితి-ఇచటఁ దృతీయార్థమునందు సప్తమి-గొల్లఁడు వనమేగెను-ఇచట షష్ఠ్యర్థమునందు ప్రథమ-సుఖముండెను-ఇచటఁ దృతీయార్థమునందు ప్రథమ-ఈలాగె తక్కిన వానికిఁ బ్రయోగములు తెలియఁదగినవి.

ఇది విభక్తి ప్రకరణము.

## సమాస ప్రకరణము.

౧ ప్ర-సమాస ప్రకరణంబనఁగా నెట్టిది.

ఉ-సమాసంబులను వానికి వచ్చు కార్యంబులను దెలుపునది సమాస ప్రకరణంబు.

౨ ప్ర-సమాసంబనఁగా నేది.

ఉ-అనేక పదములు గలసి యేకపదముగా నౌట సమాసంబు.

౩ ప్ర-సమాసంబులెన్ని విధములు గలవి.

ఉ-ద్విగుసమాసంబనియు-కర్మధారయసమాసంబనియు-తత్పురుషసమాసంబనియు-ద్వంద్వసమాసంబనియు-బహువ్రీహిసమాసంబనియు-ఉత్తరపదలోపసమాసంబనియు-రూపకసమాసంబనియు-మతుప్సమాసంబనియు-తొమ్మిది విధంబులు గలవి.

౪ ప్ర-ద్విగుసమాసంబెన్ని విధంబులు గలవి.

ఉ-ఏకవచనాంత ద్విగువనియును బహువచనాంత ద్విగువనియును-రెండు విధంబులు గలవి.

౫ ప్ర-వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ-ఇరుదెస-ఇరుగడ-ఇరువంక-ముచ్చిచ్చు-ముక్కాక-మువ్వన్నె-ముప్రొద్దు-ముత్రోవ-ఇవి యేకవచనాంత ద్విగువులు ॥ ముజ్జగంబులు-ముల్లోకంబులు-నలు దెసలు ఇవి బహువచనాంత ద్విగువులు.

౬ ప్ర-కర్మధారయంబునకు నుదాహరణంబు లేలాగు.

ఉ-చిగురుటాకులు-కలుకుటమ్ములు-పండువెన్నెల-నల్లగలువ-తెల్లదమ్మి-నల్లనివాఁడు-నల్లనియది-ఇవి కర్మధారయసమాసంబులు.

౭ ప్ర-తత్పురుషసమాసంబునకు నుదాహరణంబు లేలాగు.

ఉ-మల్లెపువ్వు-కోకచెఱఁగు-మామిడిచిగురు-పట్టుపుట్టముదాల్పు-నెలతక్కువవాఁడు-దొంగయలుకు-మాటనేర్పరి-ఇవి తత్పురుషసమాసంబులు.

౮ ప్ర-ద్వంద్వసమాసంబునకు నుదాహరణంబు లేలాగు.

ఉ-తల్లిదండ్రులు-అన్నదమ్ములు అత్తమామలు-కాయగూరలు-ఇవి ద్వంద్వసమాసంబులు.

౯ ప్ర-బహువ్రీహిసమాసంబు

లెట్టివి.

ఉ - అలరువిల్తుఁడు-కమ్మవిల్తుఁడు-ముక్కంటిపండు-చలివెలుంగు-వేఁడివెలుంగు-ఇవి బహువ్రీహిసమాసంబులు.

౧౦ ప్ర- ఉపమానసమాసంబు లెట్టివి.

ఉ - పండుమోవి-చిగురుమోవి-ఇవియుపమానసమాసంబులు.

౧౧ ప్ర- ఉత్తమపదలోపసమాసంబు లెట్టివి.

ఉ-జవ్వాదిసెట్టి-చెనుపాలరామక్క-వంటలగంగమ్మ-ఇవియుత్తరపదలోపసమాసంబులు.

౧౨ ప్ర-రూపకసమాసంబులేవి.

ఉ - కేలుదమ్మి-మోముదామర-కేలుచిగురు-మోవిపండు-మైదీగ-చెక్కుటద్దము-కన్నుగలువ-కౌనుమిన్న ఇవిరూపకసమాసంబులు.

౧౩ ప్ర-మతుప్సమాసంబులేవి.

ఉ-తావిమొల్ల-వలపుగంధపొడి-ఇవిమతుప్సమాసంబులు.

౧౪ ప్ర- ఈసమాసంబులొక్కొకటియెన్నివిధంబులుగలవి.

ఉ- సమాసంబనియు-సమాసకంబనియు - మిశ్రసమాసంబనియు మూఁడువిధంబులుగలవి.

౧౫ ప్ర-సమాసమనఁగా నేది.

ఉ- కేవలసంస్కృతంబులసమాసము- సమాసము-రాజపురుషుఁడు-లక్ష్మీవల్లభుఁడు-ఇత్యాదులు.

౧౬ ప్ర-సమాసకంబనఁగా నేది.

ఉ- తెనుఁగుపదములుమాత్రము గలసినదిసమాసకంబు.

౧౭ ప్ర-అదియెన్నివిధంబులుగలది-దానికినుదాహరణంబులేలాగు.

ఉ-లుక్సమాసకంబనియు నలుక్సమాసకంబనియు రెండువిధంబులుగలది-అందులోఁ గైదువుదారి-రాచపట్టి-రాచకొమరుఁడు- ఇవి లుక్సమాసంబునకును-ఊరఁబంది-ఊరఁబిచ్చిక-నాచేతిపోరు-ఇవి యలుక్సమాసకంబులకునుదాహరణములు.

౧౮ ప్ర-మిశ్రసమాసంబనఁగా నేది-దానికినుదాహరణంబేది.

ఉ- సంస్కృతశబ్దములుం దెనుఁగుశబ్దములుం గలసినది మిశ్రసమాసంబు- దానికి-పద్మాకరపుతావిచెలువు- సర్వైశ్వర్యలక్ష్మీనెలవు- గట్టుదొరపట్టి రామణీయకము- అనియుదాహరణంబులు.

౧౯ ప్ర-సంస్కృతపదములుం దెనుఁగుపదములుం గలసెడి కర్మధారయసమాసమునందు నెట్టి యాంధ్రపదము గలియును-దానికి నుదాహరణంబులేవి.

ఉ- ఆరక్షరములవఱకుఁ దెనుఁగుపదములు కర్మధారయమునందుఁ బూర్వపదంబై కలియును- వేఁడిమయూఖంబులు-వాఁడిబాణంబులు-కలికిభుజంగకన్యలు-వేలుపువీరభటవ్రంబులు అనియుదాహరణములు.

౨౦ ప్ర- ఈసమాసంబులు నాశ్రయించుకొని - యేకార్యంబులు వచ్చును.

ఉ- కొన్నియెడల సమాసాంతకార్యంబులును గొన్నియెడల టెంట్యాదివికారంబులును వచ్చును.

౨౧ ప్ర - వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ - అలరువిల్తుఁడు - కమ్మవిల్తుఁడు - ఇచటఁదకారము - తమ్మిచూలి ఇచట ఇకారము - నలువ - ఇచట హ్రస్వము - ఇట్టివి సమాసాంతవిధులు - మేటిముని రాజు - బ్రహ్మదండపుకైదువు - ముక్కంటిపండులు - తెలిదమ్మికంటికామిని - పుట్టినింటిసంపదపెంపు - అత్తింటిసౌభాగ్యలక్ష్మి సొంపు - కలువకంటికటాక్షపుంగవులు - ఇట్టియెడల టెంట్యాదివికారంబులు ఇవి సంధిపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడినవి.

౨౨ ప్ర-సమాసంబున ఋకారమునకు రవర్ణం బెక్కడ వచ్చును.

ఉ-మాతృపితృభావము - అనునది మొదలగు ద్వంద్వ సమాసమునందు - పూర్వపదాంతమునందున్న ఋకారమునకు వచ్చును.

౨౩ ప్ర-సమాసమునందు షష్ఠీద్వితీయవలె నెక్కడనుండును.

ఉ-తత్పురుషసమాసమునందు షష్ఠీద్వితీయవలె నుండును - దానికి దేవుని గుణములు - దేవు గుణములు - ముద్దులపడఁతి - కలుములపడఁతి - అనియుదాహరణంబులు.

౨౪ ప్ర-ఆ-ఈ-ఏ- అను దేశ్యశబ్దంబులు ఎచ్చటఁ దామ హ్రస్వమును బొందును.

ఉ-కర్మధారయ సమాసమునందు నాశబ్దములు హ్రస్వమును వికల్పముగాఁ బొందిమీఁది హల్లులకు ద్విత్వమును గలుగఁ జేయును - దానికి - అక్కాలము ఆకాలము - ఇక్కాలము - ఈకాలము ఎక్కాలము - ఏకాలము - అనియుదాహరణంబులు.

ఇది సమాసప్రకరణము.

---

## మిశ్రప్రకరణము.

౧ ప్ర-మిశ్రప్రకరణం బనఁగా నేది.

ఉ - లింగంబులు స్త్రీప్రత్యయములును - తద్ధిత ప్రత్యయములును విశేషణపదములకు గలిగియున్నవిశేషంబులును మొదలగువానిఁ దెలియఁజేయునది మిశ్రప్రకరణంబు.

౨ ప్ర, - తత్సమశబ్దంబులకెన్ని లింగంబులు.

ఉ-పుంలింగమనియు - స్త్రీలింగమనియు - నపుంసక లింగమనియు - మూఁడు లింగంబులు.

౩ ప్ర-వానిలోఁ బుంలింగంబులేవి - స్త్రీ లింగంబులేవి - నపుంసకలింగంబులేవి.

ఉ- దేవుఁడు - గురుఁడు - మూర్ఖుడు

సమహచ్ఛబ్దంబులు పుంలింగంబులు - వనిత - వధువు - ఇవి మొదలయినవి - స్త్రీవ్యక్తిని జెప్పు స్త్రీలింగంబులు - లత - మాలతి - ధేనువు - ఇవి మొదలైనవి - అస్త్రీవ్యక్తిని జెప్పు స్త్రీలింగంబులు - వనము - మధువు - ఇవి మొదలయినవి నపుంసకంబులు.

౪ ప్ర - తద్భవశబ్దంబులకెన్ని లింగంబులు.

ఉ - వానికిని మూఁడు లింగంబులు.

౫ ప్ర - వానికి నుదాహరణంబు లేవి

ఉ - చెందురుఁడు - జాతర - సంద్రము - ఇత్యాదులు సంస్కృతతద్భవంబులు మూఁడు లింగంబులకుఁ గ్రమముగ నుదాహరణంబులు - జముఁడు - జడ - పవడము - ఇత్యాదులు ప్రాకృతతద్భవంబులను మూఁడు లింగంబులకుఁ గ్రమముగ నుదాహరణంబులు - *జముఁడు - జడ - ఈశబ్దములు ప్రాకృతసమములు గాని ప్రాకృతభవములు గావు - గ్రంథకర్త చెప్పినది సరిగాదు.

౬ ప్ర - తెనుఁగుశబ్దంబులకెన్ని లింగంబులు.

ఉ - స్త్రీలింగ నపుంసకలింగంబులు రెండు.

౭ ప్ర - వానికి నుధాహరణంబు లేవి.

ఉ - గోడ - మేడ - నవలా నెజా - తావి - బావి - మోపు - వీపు - ఇత్యాదులు స్త్రీలింగంబులు - అందము - చెందము - గుజ్జము - పల్లము - ఇత్యాదులు నపుంసకలింగంబులు.

౮ ప్ర - స్త్రీప్రత్యయంబులనఁగా నేవి.

ఉ - స్త్రీలింగమునకు సూచకంబులగు వర్ణకంబులు - స్త్రీప్రత్యయంబులు.

౯ ప్ర. స్త్రీప్రత్యయంబు లేవి వానికి వచ్చును.

ఉ - స్త్రీలింగంబులగు తత్సమశబ్దంబులమీఁద సంస్కృతమునందుఁ జెప్పఁబడియున్న స్త్రీప్రత్యయంబులు వచ్చును.

౧౦ ప్ర - వానికి నుదాహరణంబు లేవి.

ఉ - శరచ్చంద్రికతాపహారిణి - పాలేఱు కాంచీసమీపవాహిని - పరదేవత సకలజగద్విధాయిక - ఇత్యాదు లుదాహరణంబులు.

౧౧ ప్ర - ఆంధ్రశబ్దములమీఁద స్త్రీప్రత్యయంబు లేవి వచ్చును.

ఉ - వానిమీఁద - అ - ఇ - ఉ - అను నీ మూఁడును వచ్చును.

౧౨ ప్ర - వానికి నుదాహరణంబు లేవి.

ఉ - కామ - కామి - కాము - గౌర - గౌరి - గౌరు - ఇత్యాదు లుదాహరణంబులు.

౧౩ ప్ర - తద్ధితప్రత్యయంబులనఁగా నేవి.

ఉ-ప్రయోగసౌకర్యార్థము గాశ
బ్దంబులమీఁదవచ్చు- ది-డు- తన-
క- అనువర్ణకంబులు తద్ధిత ప్రత్య
యంబులు.

౧౪ ప్ర - ది-వర్ణకం బెక్కు-
డవచ్చును.

ఉ-సంబంధార్థమునందువచ్చును
దానికి- అంబది- అమ్మది- మేకది-
పులిది-దేవునిది-రాజుది- ఇత్యాదు
లుదాహరణంబులు- ఇదిదివర్ణకము
గాదుతచ్ఛబ్దమనిసిద్ధాంతము.

౧౫ ప్ర-డు-అనువర్ణకంబెక్కుడ
వచ్చును.

ఉ-నీ-నా-తా- అను దేశ్యశబ్దము
లమీఁద సంబంధార్థమునందు సమా
సమునందేవచ్చును-దానికి- నీడుసొ
మ్ము-నాడుకీర్తి- తనదుమహిమ-అని
యుదాహరణంబులు.

౧౬ ప్ర-తన-అనువర్ణకంబెక్కు-
డవచ్చును.

ఉ - త్వప్రత్యయార్థమునందువ
చ్చును. దానికి-బారతనము-పెద్దత
నము-చిన్నతనము- అనియుదాహ
రణంబులు.

౧౭ ప్ర-కవర్ణకంబెక్కుడవచ్చును.

ఉ-నామంబుల మీఁద స్వార్థము
నందువచ్చును-అపుడుదానిక్రింది
వర్ణమునకు నత్వమునువచ్చును-
దానికి-నెలఁత- నెలఁతుక-పొలతి-
పొలతుక-గొంతు-గొంతుక-ఇత్యా
దులుదాహరణంబులు.

౧౮ ప్ర-విశేషణపదంబు లెలా
గునను ండును.

ఉ-విశేష్యపదంబులతో సమంబు
లైన-లింగవచన విభక్తులతోఁగూ
డియుండును- దానికి- దేవుఁడు-ర
క్షకుఁడు- వనిత - గౌరాంగి- వన
మురమణీయము - అనియుదాహర
ణంబులు.

౧౯ ప్ర-ఏవిశేషణంబులకు భి
న్నలింగముంగలదు.

ఉ-అ స్త్రీవ్యక్తని చెప్పు స్త్రీలింగ
విశేషణంబులకు నపుంసకలింగము
నుగలదువానికి-శరచ్చంద్రిక-మనో
హర-మనోహరము- అనియుదాహ
రణము.

౨౦ ప్ర - ఏవిశేషణంబులకుభి
న్నవిభక్తిగలదు.

ఉ - షష్ఠ్యంతవిశేషణంబులకుఁ
బ్రథమగలదు-దానికి-సర్వరక్షకుం
డు దేవునకాశ్రితుఁడు-ఇత్యాదులు
దాహరణంబులు.

౨౧ ప్ర - ఏవిశేషణంబులకుభి
న్నవచనమునుగలదు.

ఉ-కొన్నిబహువచనాంతవిశేష్య
ములకునేకవచనముగలదు-దానికి-
ఇంపైనజవరాండ్రు-సొంపైనసిరు
లు-అని యుదాహరణంబులు.

౨౨ ప్ర-విశేషణంబులగువర్త
మానార్థక క్రియాశబ్దములమీఁదనే
మివచ్చును.

ఉ- వానిమీఁదఁజువర్ణకమును ఉ

న్న-అనునను బంధమునువచ్చును.

౨౩ ప్ర - వానికినుదాహరణం బులేలాగు.

ఉ- పోషించు-జయించు-రంజించు-ఇవిసంస్కృతక్రియలు-చేయు మ్రొక్కు-చూచు-ఇవి దేశ్యక్రియలు - వర్తమానకాలమును జెప్పుచున్నయీక్రియాశబ్దములమీఁదఁ జూవరకమును ఉన్న అనునను బంధమును వచ్చి-పోషించుచున్న-జయించుచున్న- రంజించుచున్న- చేయుచున్న-మ్రొక్కుచున్న-చూచుచున్న అనియీలాగుననుదాహరణంబులు.

౨౪ ప్ర- విశేషణంబులగు ప్రతిషేధార్థక క్రియాశబ్దంబులమీఁదనేమివచ్చును.

ఉ-వానికి నివర్ణకమును-అత్వమును వచ్చును.

౨౫ ప్ర-వానికినుదాహరణంబులేలాగు.

ఉ - పోషింపని-జయింపని-రంజింపని-చేయని- మ్రొక్కని-చూడని-అని యీలాగున నుదాహరణంబులు.

౨౬ ప్ర-విశేషణంబులగు భూతార్థక్రియాశబ్దంబులమీఁద నేమివచ్చును.

ఉ-వానికిఇత్వమునునవర్ణకమును వచ్చును.

౨౭ ప్ర - వానికినుదాహరణం బులేలాగు.

ఉ - పోషించిన-జయించిన-రంజించిన- మ్రొక్కిన-చూచిన-అని యీలాగుననుదాహరణంబులు.

౨౮ ప్ర-కర్త్రాద్యర్థములను జెప్పుచున్న విశేషణక్రియాశబ్దంబుల మీఁదనేమికార్యంబువచ్చును- అప్పుడుకర్తకునేవిభక్తివచ్చును.

ఉ - వానిమీఁదమునుపటివలెనె ష్ఠ్యవర్ణకాదులు వికల్పముగవచ్చును-అప్పుడుకర్తకుంబ్రథమవచ్చును.

౨౯ ప్ర - వానికినుదాహరణం బులేలాగు.

ఉ-నీవునుతించినరాజు-అనియుదాహరణము- నీచేతనుతింపఁబడినరాజు- అనియర్థము- ఈలాగెనీవుప్రహరించినఖడ్గము - నీవుగోవునిచ్చినబ్రాహ్మణుఁడు-నీవుపూలుగోసినచెట్టు-నీవుభుజించినచోటు-అనికరణాదులయందు నుదాహరణంబులు- ఈలాగేప్రతిషేధార్థకమునందును-నివర్ణకాదులువచ్చి-నీవునుతింపనిరాజు-అనియుండును.

30 ప్ర- నా-స్-అను దేశ్యశబ్దవిశేషణంబులకు నేమివిశేషకార్యంబులు.

ఉ-ఏకవచనమునందు క్రమముగ నికారాంతంబులకు నివర్ణక నివర్ణకములునుదక్కిననానికి నువు-వర్ణకములును- బహువచనంబునందు నట్టికిం గ్రమముగ-ము రు-వర్ణకంబులనుఆనిపరంబులగునపుడు వానికినకారమునువచ్చును.

౩౧ ప్ర - వానికినుదాహరణంబులేలాగు.

ఉ - నేనుగవిని-నీవుకవివి-నేనుభక్తుఁడను-నీవుభక్తుఁడవు- మేముకవులము-మీరుకవులరు- మేముభక్తులము-మీరుభక్తులరు-అని యీలాగుననుదాహరణంబులు.

౩౨ ప్ర విశేషణవిశేష్యంబుల నేలాగునబ్రయోగింపవచ్చును-వానికినుదాహరణంబులేలాగు.

ఉ- వ్యవహితములుగాఁబ్రయోగింపవచ్చును-దానికి- ధర్మపాలుండు ప్రోచుఁబాధితుఁడు మిమ్ము -శిష్టరక్షకుండుగాఁచు దేవుండు మమ్ము - అని యీలాగున నుదాహరణంబులు.

౩౩ ప్ర- తెనుఁగునందు నెట్టిపదములను బ్రయోగింపవలెను.

ఉ-మిక్కిలి ప్రసిద్ధార్థకంబులైన పదములను బ్రయోగింపవలెను.

౩౪ ప్ర- తెనుఁగునందు నెట్టిసంస్కృత పదములకుఁ బ్రయోగము లేదు.

ఉ-అవ్యయములకును-సుబంతతిఙంతములకును-క్త్వా ప్రత్యయాంతములకును-తుమున్ ప్రత్యయాంతములకును- ప్రయోగము లేదు.

౩౫ ప్ర- అవియెట్టివి.

ఉ- చిరాయ-చిరస్య-ఇత్యాదులవ్యయంబులు-దేవః-దేవం-దేవేన-ఇత్యాదులుసుబంతంబులు- భవతి-ఏధతే- ఇత్యాదులు తిఙంతంబులు-కృత్వా-భుక్త్వా-ఇత్యాదులు- క్త్వా ప్రత్యయాంతములు-కర్తుం-భోక్తుం-ఇత్యాదులుతుమున్ ప్రత్యయాంతములు.

౩౬ ప్ర-అవ్యయాదులకు నెక్కడఁబ్రయోగముగలదు.

ఉ- సంస్కృతవాక్యమును-అనుకరించునపుడుగలదు- దానికి-మహతే దేవాయ నమోనమయని పలికెన్- ధర్మస్సహాయ యనిపలికెన్ అనియుదాహరణంబులు.

౩౭ ప్ర- అనుకరణమును జెప్పుచున్న యనుశబ్దము పరంబగునపుడు-నమశ్శబ్దము మొదలైన శబ్దములయొక్క-విసర్గమునకును- అహమాదిశబ్దములయొక్క- యంత్యహల్లునకునేమివచ్చును.

ఉ-ఆవిసర్గమునకులోపమును- ఆహల్లునకుద్విత్వమునువచ్చును- వానికినమోనమయని- ధర్మస్సహాయ యని- అహమ్మనికిమ్మని- ఇత్యాదులుదాహరణంబులు.

మిశ్రప్రకరణముసమాప్తము.

---

## క్రియాపరిచ్ఛేదము.

౧ ప్ర- క్రియాపరిచ్ఛేదమునందునెన్నిప్రకరణంబులు.

ఉ-క్రియాప్రకరణంబుకర్తృపురుషప్రకరణంబు-కారయితృపురుషప్రకరణంబు- కర్మపురుష ప్రకర

ణంబు-విశేషప్రకరణంబని యైదు ప్రకరణంబులు.

## క్రియా ప్రకరణము.

౧ ప్ర - క్రియ లెన్నివిధంబులు గలవి.

ఉ-తత్సమక్రియలనియు- దేశ్యక్రియలనియు రెండువిధంబులుగ గలవి.

౨ ప్ర- అందుఁదత్సమక్రియ లెన్నివిధంబులుగలవి.

ఉ-ఉపకృతిక్రియలనియుఁబరిణతిక్రియలనియు సంవృతిక్రియలనియుమూఁడువిధంబులుగలవి.

౩ ప్ర- ఉపకృతిక్రియలనఁగా నేవి-అవియేలాగుననుండును.

ఉ- పుష్-ణు-ఇవిమొదలయినవియుపకృతిక్రియలు. అవిసంస్కృతకృత్ప్రత్యయాంతంబులై-పోష-నుతి-అనియుండును.

౪ ప్ర-పరిణతిక్రియలనఁగానేవి అవియేలాగుండును.

ఉ-భూ-జి-ఇవిమొదలైనవి- పరిణతిక్రియలు-అవి-అవ్-అయ్-అర్ అనునాదేశంబులతోఁగూడి- భవ్-జయ్-భర్-అనియుండును.

౫ ప్ర-సంవృతిక్రియలనఁగానేవి-అవియేలాగుండును.

ఉ-రంజ- వసే. ఇవిమొదలైనవి సంవృతిక్రియలు- అవి వికారంబు లేకయాలాగేయుండును.

౬ ప్ర- ఈత్రివిధక్రియలమీఁద నేమియాగమంబువచ్చును- అపుడు వానిరూపంబులేలాగుననుండును.

ఉ-వానిమీఁదస్వార్థమునందునించుగాగమంబువచ్చును- అపుడువానిరూపంబులు పోషించు- నుతించు- అనుభవించు- జయించు-వసించు- అనియుండును.

౭ ప్ర-దేశ్యక్రియలనఁగా నెట్టివి-అవియేలాగుననుండును.

ఉ- మ్రొక్కు-చేయు-కను-విను ఇవిమొదలయినవి దేశ్యక్రియలు. అవి వికారంబులేక యాలాగేయుండును.

౮ ప్ర-పోషించు మొదలగుతత్సమక్రియలును మ్రొక్కు మొదలగుదేశ్యక్రియలునే యర్థంబులయందువర్తించును.

ఉ-వర్తమానార్థమునందును- భవిష్యదర్థమునందును- భూతార్థమునందును- తద్ధర్మార్థమునందును- ప్రార్థనార్థమునందును-వ్యతిరేకార్థమునందునువర్తించును.

## కర్తృపురుషప్రకరణము.

౧ ప్ర-కర్తృపురుషములనఁగా నెట్టివి.

ఉ-పూర్వోక్తక్రియలకుఁగర్తను దెలుపుచున్నపురుషములుకర్తృపురుషములు.

౨ ప్ర-ఆపురుషము లెన్నివిధంబులుగలవి.

ఉ- ప్రథమపురుషమనియు - మధ్యమపురుషమనియు- ఉత్తమపురుషమనియు మూఁడువిధంబులుగలవి.

౩ ప్ర - ప్రథమపురుషమనఁగా నెట్టిది.

ఉ- నేను నీవు నుఁ దక్కఁ దక్కిన కర్తను దెలియఁ జేయుచున్నది ప్రథమపురుషము.

౪ ప్ర - మధ్యమపురుషమనఁగా నెట్టిది.

ఉ- యుష్మచ్ఛబ్దార్థము కర్తగాఁ దెలియఁజేయుచున్నది మధ్యమపురుషము.

౫ ప్ర - ఉత్తమపురుషమనఁగా నెట్టిది.

ఉ- అస్మచ్ఛబ్దార్థము కర్తగాఁ దెలియఁ జేయుచున్నది యుత్తమపురుషము.

౬ ప్ర- ఆపురుషములలో నొక్కొకటి యెన్నివిధంబులుగలది.

ఉ- ఏకవచనంబనియు బహువచనంబనియు నొక్కొకటి రెండేసివిధంబులు గలది.

౭ ప్ర- ప్రథమ పురుషములో నేకవచనరూపంబులేవి - బహువచనరూపంబులేవి.

ఉ- డు - ది - దు- అనునవి యేకవచనరూపంబులు - రు - వు - వి - అనునవి బహువచనరూపంబులు.

౮ ప్ర- ఆ యేకవచనంబులలో నెక్కడెక్కడ నేదేది వచ్చును.

ఉ- మహత్తుకర్తయైనపుడు - వర్తమానార్థమునందును- భవిష్యదర్థమునందును - వ్యతిరేకార్థమునందును - డువర్ణకము వచ్చును - అమహత్కర్తయైనపుడు - వర్తమానార్థమునందు - దివర్ణకమును భవిష్యదర్థవ్యతిరేకార్థములయందు దువర్ణకమును వచ్చును.

౯ ప్ర- ఆ బహువచనంబులలో నెక్కడెక్కడ నేదేది వచ్చును.

ఉ- రు - అనునది - మహత్తులును - స్త్రీలును - కర్తలగునపుడు వచ్చును - తిర్యగ్జడంబులు కర్తలగునపుడు వర్తమానార్థమునందు వివర్ణకమును భవిష్యద్వ్యతిరేకార్థములయందు వువర్ణకమును వచ్చును.

౧౦ ప్ర- మధ్యమపురుషములో నేకవచనరూపంబులేవి - బహువచనరూపంబులేవి.

ఉ- వు - ము - అనునవి యేకవచనరూపంబులు - రు - ఁడు - అనునవి బహువచనరూపంబులు.

౧౧ ప్ర- ఆ యేకవచనబహువచనంబులలో నెక్కడెక్కడ నేదేది వచ్చును.

ఉ- ము - ఁడు - అనునవి - ప్రార్థనార్థమునందును - వు - రు - అనునవి తక్కిన యర్థములయందును వచ్చును.

౧౨ ప్ర- ఉత్తమపురుషములో నేకవచనరూపంబేది - బహువచనరూపంబేది.

ఉ-ను-అనునిది యేకవచనరూపంబు-ము అనునిది బహువచనరూపంబు

౧౩ ప్ర-తత్సమక్రియలకును దేశ్యక్రియలకును వర్తమానార్థమునందు మహత్తుకర్తయైనపుడు మూఁడు పురుషములయందు నేమి విశేషకార్యంబులు-ఏలాగు రూపంబులు.

ఉ-ఆ క్రియలయందు నించుగాగమమును దానిపైని జున్నగ్గకమును దానిపైను న్నానుబంధమును దానికి దీర్ఘమును విశేషకార్యంబులు - వాఁడు పోషించుచున్నాఁడు వారు బోషించుచున్నారు - నీవు పోషించుచున్నావు - మీరు పోషించుచున్నారు - నేను పోషించుచున్నాను - మేము పోషించుచున్నాము - అని తత్సమక్రియలకు రూపంబులు - మ్రొక్కుచున్నాఁడు - మ్రొక్కుచున్నారు - మ్రొక్కుచున్నావు - మ్రొక్కుచున్నారు - మ్రొక్కుచున్నాను - మ్రొక్కుచున్నాము - అని దేశ్యక్రియలకు రూపంబులు.

౧౪ ప్ర-ఇచ్చోట నమహత్తుకర్తయైనపుడేమి విశేషంబు.

ఉ-అపుడు ప్రథమపురుషైకవచనంబున పోషించుచున్నది - మ్రొక్కుచున్నది-అనియును-ఆ బహువచనంబున దిర్యగ్జడంబులు కర్తలగునపుడు- పోషించుచున్నవి - మ్రొక్కుచున్నవి-అనియును-ఉన్నానుబంధమునకు - దివర్ణక నివర్ణకములయందు దీర్ఘంబు లేని రూపంబులు విశేషంబులు.

౧౫ ప్ర-తత్సమ క్రియలకును దేశ్యక్రియలకును భవిష్యదర్థమునందును మహత్తుకర్తయైనపుడు మూఁడు పురుషములయందు నేమి విశేషకార్యంబులు-ఏలాగు రూపంబులు.

ఉ-వానికిని పుడించుగాగమ చకారమునకుఁ బకారమును-అయ్యుత్త్వమునకత్వమును - దానిమీఁద ద్రుతాగమమును-దానిపైఁ గలానుబంధమును విశేషకార్యంబులు పోషింపఁగలఁడు - మ్రొక్కఁగలఁడు- పోషింపఁగలరు- మ్రొక్కఁగలరు-పోషింపఁగలవు- మ్రొక్కఁగలవు- పోషింపఁగలరు- మ్రొక్కఁగలరు- పోషింపఁగలను- మ్రొక్కఁగలను- పోషింపఁగలము- మ్రొక్కఁగలము-అని రూపంబులు.

౧౬ ప్ర-ఇచ్చోట నమహత్తుకర్తయైనపుడేలాగు రూపంబులు.

ఉ - ఏకవచనంబున- స్త్రీ పోషింపఁగలదు- మ్రొక్కఁగలదు - చిలుక పోషింపఁగలదు- మ్రొక్కఁగలదు- అనియును - బహువచనంబున- స్త్రీలు పోషింపఁగలరు - మ్రొక్కఁగలరు - చిలుకలు పోషింపఁగలవు- మ్రొక్కఁగలవు- అనియును రూపంబులు.

౧౭ ప్ర - తత్సమదేశ్యక్రియలకు భూతార్థమునందు నేమి విశేషకార్యంబులు-అపుడేలాగు రూపంబులు

ఉ- ప్రథమపురుషైకవచనంబునకు లోపమును క్రియాంత్యంబునకు నేకారమును - తక్కిన పురుషముల యందు నంతటం గ్రియాంత్యంబునకును విభక్త్యంతములకు నికారమును ప్రథమపురుషము దక్కఁ దక్కిన పురుషములకు గ్రిందుగాఁ దివర్ణకమును వచ్చును- అపుడు పోషించెను- మ్రొక్కెను- పోషించిరి- మ్రొక్కిరి- పోషించితివి- మ్రొక్కితివి - పోషించితిరి- మ్రొక్కితిరి - పోషించితిని- మ్రొక్కితిని- పోషించితిమి- మ్రొక్కితిమి- అనిరూపంబులు.

౧౮ ప్ర- ఇచ్చోటఁ దిర్యగ్జడంబులు కర్తలగునపు డేమి విశేషంబు.

ఉ- బహువచనము నేకవచనమగును- దానికి- చిలుకలు పోషించెను- మేఘములు వర్షించెను- పికములు మ్రోసెను అని యుదాహరణంబులు.

౧౯ ప్ర- తత్సమదేశ్యక్రియలకుఁ దద్ధర్మార్థమునందు నేమి విశేషకార్యంబులు - అపు డేలాగు రూపంబులు.

ఉ- ప్రథమపురుషైకవచనలోపమును దక్కిన పురుషములకు - క్రిందుగా దువర్ణకమును- ఆ దువర్ణకము పరంబగునపుడు క్రిందనున్న చుకారంబునకు నొకపక్షమున లోపము నొకపక్షమున నాచకారమునకుఁ బకారమును - బిందుపరంబగు చకారమునకుఁ దకారమును వచ్చును- అపుడు పోషించును- మ్రొక్కును- పోషింతురు- పోషింపుదురు- మ్రొక్కుదురు- పోషింతువు- పోషింపుదువు- మ్రొక్కుదువు- పోషింతురు- పోషింపుదురు- మ్రొక్కుదురు - పోషింతును - పోషింపుదును- మ్రొక్కుదును- పోషింతుము - పోషింపుదుము- మ్రొక్కుదుము- అనిరూపంబులు.

౨౦ ప్ర- ఇచ్చోటఁ దిర్యగ్జడంబులు కర్తలైనపు డేమి విశేషంబు.

ఉ- బహువచనం బేకవచనమగును- దానికి- చిలుకలు పోషించును- వాద్యములు మ్రోయును - మేఘములు వర్షించును - అని యుదాహరణంబులు.

౨౧ ప్ర- తత్సమదేశ్యక్రియలకు వ్యతిరేకార్థమునందు నేమి విశేషకార్యంబులు- ఏలాగు రూపంబులు.

ఉ- అపుడు వానియందు గాగమ చకారమునకుఁ బకారమును వానితుదనున్న యుకారమున కకారమును విశేషకార్యంబులు- వానికి- మహత్కర్తృకమైనపుడు - పోషింపఁడు మ్రొక్కఁడు- పోషింపరు- మ్రొక్కరు- పోషింపవు- మ్రొక్కవు- పోషింపరు- మ్రొక్కరు- పోషింపను- మ్రొక్కను- పోషింపము- మ్రొక్కము అనిరూపంబులు అమహత్తులు కర్తలైనపుడు - ప్రథమపురుషైకవచనమునందు- పోషింపదు- మ్రొక్కదు- అనియును బహువచనమునందు- తిర్య

గ్జడంబులు - కర్తలైనప్పుడు పోషింపవు - మ్రొక్కఁవు - అనియును విశేష రూపంబులు.

౨౨ ప్ర - తత్సమదేశ్యక్రియలకుఁ బ్రార్థనార్థకంబునందు నేమి విశేష కార్యంబులు ఏలాగు రూపంబులు.

ఉ - ప్ర - వానియించుగాగమ చకారమునకుఁ బకారమును వానిపై వచ్చు - ము వర్ణకఁడు వర్ణకములకు నొకపక్షంబున ఈకారమును - విశేష కార్యంబులు - వానికి - పోషింపుము పోషింపుమి - మ్రొక్కుము - మ్రొక్కుమీ - పోషింపుఁడు - పోషింపుఁడీ - మ్రొక్కుఁడు - మ్రొక్కుఁడీ - అని రూపంబులు.

౨౩ ప్ర - అయాదేశరహితంబులైన దవ్యక్షగక్రియలయందు ఘుపూర్వకంబైన క్రియాంత్యవర్ణంబునకు నేమి విశేషంబు - దానికి నుదాహరణంబులేలాగు.

ఉ - దానికి నిత్యంబు వికల్పముగ వచ్చును దానికి - ఘటియించెను - ఘటించెను - నటియించెను - నటించెను - తెగియించెను - తెగించెను - ముగియించెను - ముగించెను - ఇత్యాదులుదాహరణంబులు.

౨౪ ప్ర - కొన క్రియ పరంబగునప్పుడు పూర్వమునందున్న క్రియలకేమి విశేషంబు - దానికి నుదాహరణంబులేలాగు.

ఉ - దానికి నిత్యంబు వికల్పముగ వచ్చును - దానికి పోషించికొనియెను పోషించుకొనియెను - నుతించికొనియెను - నుతించుకొనియెను - కావించికొనియెను - కావించుకొనియెను - నేర్చికొనియెను - నేర్చుకొనియెను - మ్రొక్కికొనియెను - మ్రొక్కుకొనియెను - అనియుదాహరణంబులు.

౨౫ ప్ర - రంజించు - ఘటించు మొదలగు నకర్మకక్రియలకు నేమి విశేషంబు - దానికి నుదాహరణంబులేలాగు.

ఉ - వానియందున్న బిందుచకారంబులకుఁ గొన్నియెడల నిత్యముగా రెంటికిని రెండు లకారంబులు నుగొన్నియెడల రెంటికి నొకపక్షంబున రెండు లకారంబులు నొకపక్షంబున నొక లకారంబును వచ్చును దానికి - రంజిల్లుచున్నాఁడు - ఘటిల్లుచున్నాఁడు - ఇవి మొదటిపక్షమునందును - వర్తిల్లుచున్నాఁడు - వర్తిలుచున్నాఁడు - శోభిల్లుచున్నాఁడు - శోభిలుచున్నాఁడు - ఇవి రెండవపక్షమునందును దాహరణంబులు.

౨౬ ప్ర - తత్సమక్రియలయందు నించుగాగమమునకుఁ గ్రిందుగా విశేషాగమంబెక్కడ వచ్చును - వానికి నుదాహరణంబులేలాగు.

ఉ - ఆజ్ఞా - విజ్ఞా - సంజ్ఞా - అనునివి మొదలగువానిమీఁద పుగాగమంబు విశేషంబుగా వచ్చును - వానికి - ఆ

జ్ఞాపించుచున్నాఁడు - విజ్ఞాపించుచున్నాఁడు - సంజ్ఞాపించుచున్నాఁడు - ఇత్యాద్యుదాహరణంబులు.

౨౭ ప్ర - ఏనామపదంబులు క్రియాపదంబులగును - వానికినుదాహరణంబులేలాగు.

ఉ - అస్తమ్ - అహమ్ - అంతర్ - ఇత్యాదిసంస్కృతావ్యయ పదంబులును - ఇనుమడి - ముమ్మడి - సరబడి - తురంగలి - చెంగలి - తొలకరి - తల్లడ - ఇత్యాదిదేశ్యపదంబులును - క్రియార్థవివక్షచేతనే - ఇంచుగాగమంబును బొంది - క్రియాపదంబులగును - వానికి - అస్తమించెను - అహమించెను - అంతరించెను - ఇనుమడించెను - ముమ్మడించెను - సరబడించెను - తురంగలించెను - చెంగలించెను - తొలకరించెను - తల్లడించెను - అనియుదాహరణంబులు.

---

## కారయితృపురుష ప్రకరణము.

౧ ప్ర - కారయితృపురుషములనఁగానెట్టివి - వానిభేదంబులును రూపంబులునేలాగు.

ఉ - పూర్వోక్తక్రియలకుఁ బ్రవర్తకకర్తను దెలుపుచున్న పురుషములు కారయితృపురుషములు - వానికి ప్రథమమధ్యమాదిభేదంబులును రూపంబులును గర్తృపురుషములకువలెఁ దెలియఁదగినవి.

౨ ప్ర - పోషించు మొదలగు తత్సమక్రియలకును మ్రొక్కు మొదలగు దేశ్యక్రియలకును గారయితృపురుషములు వచ్చునపుడు నేమివిశేషకార్యంబులు అపుడు వానిరూపంబులేలాగు.

ఉ - వానిమీఁద నాయర్థమునందు నించుగను దానిక్రిందనున్న - ఇంచుగాగమ చకారమునకుఁ బకారమును విశేషంబులగు కార్యంబులు. అవుడు - పోషింపించు - నుతింపించు - అనుభవింపించు - జయింపించు - మ్రొక్కించు - చేయించు అనిరూపంబులు

౩ ప్ర - పోషింపించు - మ్రొక్కించు - మొదలగువానికినర్థంబును - వానిమీఁదఁ బురుషరూపంబులును - అపుడు కార్యంబులు నేలాగు.

ఉ - అన్నియు ముందు తత్సమదేశ్యక్రియలకుఁ జెప్పినట్టె వచ్చును.

౪ ప్ర - వర్తమానాద్యర్థంబులందు వానిరూపంబులేలాగు.

ఉ - వర్తమానార్థమునందుఁ బోషింపించుచున్నాఁడు - మ్రొక్కించుచున్నాఁడు - అనియును భవిష్యదర్థమునందు - పోషింపింపఁగలఁడు - మ్రొక్కింపఁగలఁడు - అనియును - భూతార్థమునందు - పోషింపించెను - మ్రొక్కించెను - అనియును - తద్ధర్మార్థమునందు - పోషింపించును - మ్రొక్కించును - అనియును వ్యతిరేకార్థమునందు - పోషింపింపఁడు - మ్రొక్కింపఁడు - అనియును ప్రార్థనార్థ

ము నందు - పోషింపింపుము - మ్రొక్కింపుము - అనియును - వర్తమాన భవిష్యద్వ్యతిరేకార్థములయందు - స్త్రీ పశుజడంబులు కర్తలగునపుడు పోషింపించుచున్నది - పోషింపించుచున్నవి - పోషింపింపఁగలదు - పోషింపింపఁగలవు - పోషింపింపదు - పోషింపింపవు - అనియును రూపంబులు.

౫ ప్ర - రంజించు ఘటించు - మొదలగు నకర్మక క్రియలకుఁ గారయిత్రర్థమునందు నేమి విశేషంబు - అపుడు వానికి రూపంబు లేలాగు.

ఉ - కారయిత్రర్థమునందు వచ్చు నించు వర్ణకమునకుఁ గ్రిందనున్న నించుగాగమబిందు చకారంబులకు లకారద్వయము లేమి యులోపంబును విశేషంబులు - దానికి - రంజించుచున్నాఁడు - ఘటించుచున్నాఁడు - అనియీలాగునరూపంబులు.

౬ ప్ర - కారయిత్రర్థమునందు నే క్రియలకు నించుగాగమమునకుఁ గ్రిందుగా విశేషాగమంబువచ్చును - వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ - ప్రస్థా - ప్రతిష్ఠా - ఉద్ధా - అనునివి మొదలగు వానిమీఁద పుగాగమంబు విశేషంబుగవచ్చును - వానికి - ప్రస్థాపించుచున్నాఁడు - ప్రతిష్ఠాపించుచున్నాఁడు - ఉద్ధాపించుచున్నాఁడు - ఇత్యాదులుదాహరణంబులు.

---

## కర్మపురుష ప్రకరణము.

౧ ప్ర - కర్మపురుషములనఁగా నెట్టివి.

ఉ - పోషించు - మ్రొక్కు - మొదలగు తత్సమ దేశ్య క్రియలకుఁ గర్మమును దెలియఁజేయుచున్న పురుషములు కర్మపురుషములు.

౨ ప్ర - ఆక్రియలమీఁద నాపురుషములు వచ్చునపు డేమి విశేషంబు.

ఉ - వానిమీఁద నపుడు పద్వ్యనుబంధమును - దానిక్రిందనున్న నించుగాగమమునకత్వమును - ఆచకారమునకుఁ బకారమును మీఁద ద్రుతంబును విశేషకార్యంబులు తక్కిన కార్యంబులన్నియును గర్తృపురుషములయందువలెవచ్చును.

౩ ప్ర - వానికి నుదాహరణంబు లేలాగు.

ఉ - వర్తమానార్థమునందు - పోషింపఁబడుచున్నాఁడు - మ్రొక్కఁబడుచున్నాఁడు - అనియును - భవిష్యదర్థమునందుఁ బోషింపఁబడఁగలఁడు - మ్రొక్కఁబడఁగలఁడు - అనియును - భూతార్థమునందు - బోషింపఁబడెను - మ్రొక్కఁబడెను. అనియును - తద్ధర్మార్థమునందుఁ బోషింపఁబడును - మ్రొక్కఁబడును - అనియును వ్యతిరేకార్థమునందుఁ బోషింపఁబడఁడు - మ్రొక్కఁబడఁడు - అనియును - ప్రార్థనార్థమునందుఁ బోషిం

పఁబడుము- మ్రొక్కఁబడుము- అని
యును- స్త్రీపశుజడంబులు కర్తలగు
నపుడు వర్తమానాద్యర్థములయం
దు- పోషింపఁబడుచున్నది- పోషిం
పఁబడుచున్నవి- పోషింపఁబడఁగల
దు- పోషింపఁబడఁగలవు- పోషింపఁ
బడదు- పోషింపఁబడవు- అనియును
దాహరణంబులు.

## విశేషప్రకరణము.

౧ ప్ర-కర్త్రర్థమునందును- గా
రయిత్రర్థమునందును- గర్మార్థ
మునందును- బురుషములకుఁ బ్రకృ
తులగు నతత్సమదేశ్యక్రియలమీఁ
దక్త్వాప్రత్యయార్థమునందు నేమి
వచ్చును- అపుడు వానికినుదాహర
ణంబులేలాగు.

ఉ-అట్టితత్సమదేశ్యక్రియలమీఁ
ద నికారంబువచ్చును- వానికి- పో
షించివచ్చెను- మ్రొక్కివచ్చెను- పో
షింపించివచ్చెను- మ్రొక్కించివ
చ్చెను- పోషింపఁబడివచ్చెను- మ్రొ
క్కఁబడివచ్చెను- ఇత్యాదులుదాహర
ణంబులు- వీనిమీఁదవిభక్తులు లేవు.

౨ ప్ర-ఆత్రివిధప్రకృతిక్రియ
లమీఁదవ్యతిరేకార్థము వివక్షించిన
పుడు క్త్వాప్రత్యయార్థమునందు నే
మివచ్చును- అపుడు వానికినుదాహ
రణంబులేలాగు.

ఉ-ఆక్రియలమీఁదనపుడు కవర్గ
కమును- దానిక్రిందనున్న క్రియాం
త్యంబునకు నకారమును- ఇంచుగా
గమ చకారమునకుఁ బకారమును వ
చ్చును - వానికిఁ బోషింపకవచ్చెను-
మ్రొక్కకవచ్చెను- పోషింపింపకవ
చ్చెను- మ్రొక్కింపకవచ్చెను- పో
షింపఁబడకవచ్చెను- మ్రొక్కఁబడ
కవచ్చెను - ఇత్యాదులుదాహరణం
బులు- వీనిమీఁదవిభక్తులు లేవు.

౩ ప్ర- ఆత్రివిధప్రకృతిక్రియ
లమీఁదఁ దుమునర్థమునందు నేమి
వచ్చును - అపుడు వానికినుదాహర
ణంబులేలాగు.

ఉ - అపుడు వానియంత్యవర్ణ
మున కకారమును దానిక్రిందనున్న
యించుగాగమ చకారమునకుఁ బ
కారమును వచ్చును- వానికిఁ బోషిం
పలేఁడు- మ్రొక్కలేఁడు- పోషింపిం
పలేఁడు- మ్రొక్కింపలేఁడు- పోషిం
పఁబడలేఁడు మ్రొక్కఁబడలేఁడు- ఇ
త్యాదులుదాహరణంబులు- వీనిమీఁ
దవిభక్తులు లేవు.

౪ ప్ర-ఆత్రివిధప్రకృతిక్రియ
లమీఁద భావార్థమునందు నేమివచ్చు
ను- అపుడు వానికినుదాహరణంబు
లేలాగు.

ఉ-వానిమీఁదనపుడు టగాగమము
వచ్చును- వానికి- పోషించుట- మ్రొ
క్కుట- పోషింపించుట- మ్రొక్కిం
చుట- పోషింపఁబడుట- మ్రొక్కఁబ
డుట- ఇత్యాదులుదాహరణంబులు-
వీనిమీఁదవిభక్తులుమాత్రముగలవు.

౫ ప్ర-క్రియలమీఁదను నామంబులమీఁదను బ్రశ్నార్థమునందు నేమివచ్చును - వానికినుదాహరణంబులేలాగు.

ఉ-వానిమీఁద నేకారాకారంబులువచ్చును- వానికి-పోషించితివే పోషించితివా - పలుకవేటికనాతోడనని యుదాహరణంబులు.

౬ ప్ర-వ్యతిరేక క్రియలమీఁదఁ బ్రార్థనార్థమునందు నేమివచ్చును అపుడు వానికినుదాహరణంబులేలాగు

ఉ-అపుడు వానిమీఁద నేకారోకారంబులువచ్చును-వానికి-ముమ్ము రక్షింపనే-రక్షింపవో-అనియుదాహరణంబులు.

౭ క్రియలమీఁదను నామములమీఁదను సందేహార్థమునందు నేమివచ్చును-అపుడు వానికి నుదాహరణంబులేలాగు.

ఉ-వానిమీఁదనపుడు ఓకారంబువచ్చును - దానికిఁ బోషింపఁడో నాఁడో-వీఁడో - అనియుదాహ ణంబులు.

౮ ప్ర-తత్సమ క్రియలకంటె శ్య క్రియలకుఁ బురుషములయఁ నర్థములయందును వచనంబుల య దు నేమి విశేషంబు- అపుడు వానికి దాహరణంబులేలాగు.

ఉ-కొన్ని దేశ్య క్రియలకువ మంబువిశేషంబు-వానికి- వచ్చు న్నాఁడు- రాఁడు- రాగలఁడు రప్పి చెదరావించెద - అనియుదాహ ణంబులు.

౯ ప్ర-ఉకారాంతదేశ్య క్రి పదంబులకు నేమివిశేషంబు-అపు వానికినుదాహరణంబులేలాగు.

ఉ-వానికినొకపక్షంబున నుకా లోపము వచ్చుచు-వానికిఁ జూతుర చూతుర్ - చూడరు-చూడర్ - అ యుదాహరణంబులు.

క్రియాపరిచ్ఛేదము సమాప్తము.

